


రుచిగా
చల్లగా
తియ్యగా వుండే

పార్లే

ఎక్స్‌ట్రా-స్ట్రాంగ్
పెప్పరమింట్లు

9 పెప్పరమింట్లు ఉండే ప్యాకెట్
ఎంతో తక్కువ ధరకు లభిస్తాయి
మాధుర్యమైన ఆహ్లాదమునకు
ఆహ్లాదకరమైన మాధుర్యమునకు










everest/981/PP tel

# చందమామ

మే 1971

ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు





ఇవి గాక ఫోటో శీర్షికల పోటీ
మొదలైన మరి ఎన్నో ఆకర్షణలు.











# కాల్గేట్ డెంటల్ క్రీమ్‌తో నోటి దుర్వాసనను ఆపండి... రోజంతా దంతక్షయాన్ని నివారించండి!




కాల్గేట్ 10 మందిలో 7 గురికి వెంటనే నోటి దుర్వాసనను నివారించినదని, భోజనము అయిన వెంటనే కాల్గేట్ పద్ధతిలో పళ్ళు తోముకొంటే ఎక్కువ దంతక్షయమును, ఎక్కువ మందికి అరికట్టినదని దంతశాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ ప్రకటింపబడని శాస్త్ర పరీక్షలు నిరూపించాయి. ఎందుకంటె: కాల్గేట్ డెంటల్ క్రీముతో ఒకసారి పళ్ళు తోముకొంటేనే 85% వరకు నోటి దుర్వాసన మరియు దంతక్షయమును కలిగించే సూక్ష్మ క్రిములు పోతాయి. కాల్గేట్‌కు మాత్రమే యీ గుణాలు ఉన్నాయి! ఎంతో చక్కని పెప్పర్‌మెంట్ రుచి కూడ ఉంది—కాల్గేట్ డెంటల్ క్రీముతో రోజూ పళ్ళు తోముకొనుటకు పిల్లలు ఇష్టపడతారు!

**COLGATE DENTAL CREAM**

శుభ్రమైన, తాజా శ్వాసకు మరియు తెల్లగా మెరిసే పళ్ళకు...ఎక్కువమంది జనులు ప్రపంచములో ఏ యితర టూత్‌పేస్ట్‌కంటె కాల్గేట్‌నే కొంటారు!

DC.G.41 TL

# వివా

రెండు విధములుగా ఆరోగ్యమును కలిగించే పానీయము

## పగలంతా ఎంతో శక్తి...
## రాత్రంతా సుఖమైన విశ్రాంతి





వివా త్రాగండి—వేడిగా లేక చల్లగా, నీళ్లలో లేక పాలలో. మాల్ట్, గోధుమ మరియు ప్రోటీనులతో పుష్టివంతముగా చేయబడినదే వివా. అది స్నాయువులను బలపరుస్తుంది, నరములకు ఉపశమనమును కలిగిస్తుంది, కండరములకు సేదదేరుస్తుంది.

ప్రొద్దున్న వివా త్రాగితే రోజంతా ఉత్సాహముగా ఉంటారు!
రాత్రి వివా త్రాగితే గాఢముగా నిద్రపడుతుంది!
వివా సులభముగా జీర్ణమవుతుంది. అది రోగులకు, రోగము నుండి కోలుకొంటున్న వారికి ప్రత్యేకముగా సిఫార్సు చేయబడినది.

***రుచిగా ఉంటుంది కమ్మగా—***
***జీర్ణమవుతుంది త్వరగా!***






Shilpi-JI-4C/71 TEL.

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉదహరిస్తూ, మాకు తెలపాలి. ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ కొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్
'చందమామ బిల్డింగ్స్'
మదరాసు - 26

ఏమా వృద్ధి! ఏమా వింత!
టానిక్ వల్ల అంత గొప్ప వ్యత్యాసం కలుగగలదా?






ఇన్‌క్రిమిన్* మీ బిడ్డకు ఎదిగేందుకు ఆకలిని కలిగిస్తుంది

పెద్ద పిల్లలకు ఐరన్‌తో కూడిన ఇన్‌క్రిమిన్ సిరప్-175 మి.లీ. మరియు 57 మి.లీ.

పసి బిడ్డలకు 10 మి.లీ. ఇన్‌క్రిమిన్ డ్రాప్స్








Lederle అన్ని మందుల షాపులలో లభించుచున్నది. ఇన్‌క్రిమిన్ తయారు చేయువారు లెదర్లీ—అంతర్జాతీయంగా నమ్మకమైన పేరు. లెదర్లీ డివిజన్, సయానమిడ్ ఇండియా లిమిటెడ్. 254 / డి 2. డా. ఆ. బిసెంట్ రోడ్. బొంబాయి 25.

*అమెరికన్ సయానమిడ్ కంపెనీ వారి రిజిస్టర్డ్ మార్కు

లింటాస్-INC. 15-500 TL



# చందమామ

సంచాలకుడు: 'చక్రపాణి'

జీవితమంతా పరోపకారంపైనే ఆధారపడి ఉన్నది. ఉపకారులకు అపకారం చేసే కృతఘ్నులుంటారు, కాని ఉపకారం చెయ్యటమే నేరంగా పరిగణించటం సాధ్యం కాదు. ఈ నీతి "ఉపకార నేరం" అన్న కథలో ఉన్నది. నిండుగా బతకటానికి చావు ప్రతిబంధకం కారాదన్న నీతి "మూడు గండాలు" [బేతాళ కథ] లో ఉన్నది.

సంపుటి 48 మే '71 సంచిక 5





# అమరవాణి

వరం తుంగా చ్ఛృంగా ద్గురుశిఖరిణః క్వాపి విషమే
పతిత్వాయం కాయః కఠిన దృషదంతే విదలితః,
వరం న్యస్తో హ స్తః ఫణిపతిముఖే తీక్ష్ణదశనే,
వరం వహ్నౌ పాతః, తదపి న కృతః శీలవిలయః    1

[శీలాన్ని పోగొట్టుకోవటం కన్న ఎత్తయిన కొండ మీది నుంచి కఠినమైన ఎగుడుదిగుడు శిలల మీద పడి దేహం నాశనం కావటం మేలు; వాడికోరలు గల సర్పరాజు నోటిలో చెయ్యి పెట్టటం మేలు; అగ్నిలో దూకటం మేలు.]

ఐశ్వర్యస్య విభూషణం సుజనతా, శౌర్యస్య వాక్సంయమః,
జ్ఞాన స్యోపశమః, శ్రుతస్య వినయో, వి త్తస్య పాత్రే వ్యయః,
అక్రోధ స్తపసః, క్షమా ప్రభవితు, ర్ధర్మస్య నిర్వ్యాజతా,
సర్వేషా మపి సర్వకారణ మిదం శీలం పరం భూషణం    2

[ఐశ్వర్యవంతుడిలో సౌజన్యమూ, శూరుడిలో మితభాషిత్వమూ, జ్ఞానిలో శాంతమూ, ధనికుడిలో పాత్రదానమూ, తపస్విలో కోపం లేకపోవటమూ, విజ్ఞానిలో వినయమూ, ధర్మాత్ముడిలో వంకలు వెతకకపోవటమూ, అన్నింటిలోనూ శీలమూ గొప్ప అలంకారాలు.]

శీలం



# ఉపకార నేరం

ఒక దేశపు రాజు ఒకనాడు వేటకుపోయి, వేటతమకంలో అరణ్యంలో ఒంటరిగాడై పోయాడు. ఆ సమయంలో ఒక మనిషి పులితో పోరాడటం అతని కంట పడింది.

రాజు వెంటనే పులిని తన బాణాలతో కొట్టి పడేసి, కత్తితో చంపి, ఆ మనిషిని కాపాడి, "ఎవరు నువు?" అని అడిగాడు.

"నేను ఎవరినో చెబుతాను. మీ చేతులు చాచి చూపండి," అన్నాడు ఆ మనిషి. రాజు ఆశ్చర్యపడి తన చేతులు చాచాడు. వెంటనే ఆ మనిషి రాజు రెండు చేతులనూ కలిపి కట్టుతూ, "నేను దొంగను," అని రాజు ఆభరణాలన్నీ తీసేసుకున్నాడు.

రాజు అతని చర్యకు నిర్ఘాంతపోయి, "నేను పులిని చంపి ఉండకపోతే నిన్ను పులి ఈపాటికి చంపి ఉండునే! ఎందుకిలా చేస్తున్నావు?" అని అడిగాడు. దానికి దొంగ, "నేను ప్రాణరక్షణ చెయ్యమని నిన్ను కోర లేదు. పులిచేత చావకుండా బతికాను గనక, నా వృత్తి నేను చేసుకోక తప్పదు," అన్నాడు.

అతను రాజు ఒంటి మీద ఉన్న నగలన్నీ ఒలవటం పూర్తి చేసి అరణ్యంలో ఎటో వెళ్ళిపోయాడు.

తరవాత రాజు పరివారం రాజును వెతుక్కుంటూ వచ్చి, చేతి కట్లు విప్పింది.

రాజు తన నగరానికి తిరిగి వెళ్ళి, "ఇక నుంచీ ఈ రాజ్యంలో పరోపకారం నేరంగా భావించబడి, తీవ్రంగా శిక్షించబడుతుంది," అని దేశమంతటా చాటింపు వేయించాడు.

ఈ చాటింపు విని రాజు దగ్గిర కొలువున్న వాళ్ళేగాక ప్రజలు కూడా చాలా బాధపడ్డారు.

రాజు శాసనం చేసి ఊరుకోక, పరోపకారం చేసేవారిని పట్టుకోవటానికి చారులను నియమించాడు. వాళ్ళు కొంతమందిని పట్టుకు వచ్చారు. రాజు వాళ్ళను విచారించి, కారాగృహంలో పెట్టించాడు.

ఆర్. ప్రసాదరావు

ఇదంతా భరించలేక మంత్రి, రాజుగారి అవివేకాన్ని అరికట్టటానికి ఒక ఉపాయం ఆలోచించాడు. రాజుగారికి ఈ విపరీత బుద్ధి కలిగించిన దొంగ విచ్చల విడిగా బాటసారులను కొల్లగొట్టుతున్నాడని మంత్రికి తెలియ వచ్చింది.

అందుచేత మంత్రి మారువేషం వేసుకుని, కొంత డబ్బు వెంట తీసుకుని అరణ్యం ప్రవేశించాడు. ఆయన ఊహించినట్టే దొంగ ఆయనను అటకాయించి డబ్బు లాగేసుకున్నాడు.

"ఈ రాజు దగ్గిర కొలువు చేయలేక దేశాంతరం పోదామని బయలుదేరితే నాకు నువ్వెక్కడ దాపరించావురా, బాబూ?" అన్నాడు మంత్రి.

"నువు రాజు దగ్గిర కొలువు చేస్తావా?" అన్నాడు దొంగ.

"అవును. కావలిస్తే రాజుగారి ఖజానా దొంగిలించు," అన్నాడు మంత్రి.

"ఖజానా దొంగతనం చెయ్యటానికి సహాయం చేస్తే నీకు అందులో భాగం కూడా ఇస్తాను," అన్నాడు దొంగ. "రాజు సొత్తు దోస్తానంటే సంతోషంగా సహాయం చేస్తాను," అన్నాడు మంత్రి.

ఆ రాత్రి వాళ్ళు రాజభవనం సమీపంలో ఉండగా మంత్రి, "దొంగ, దొంగ" అని కేక వేశాడు. కాపలావాళ్ళు వచ్చి దొంగను పట్టుకున్నారు.

మర్నాడు రాజు దొంగను చూస్తూనే, "ఈ నీచుడి తల నరకండి," అన్నాడు.

ఆ మాట వినగానే మంత్రి పెద్ద పెట్టున ఏడవసాగాడు.

"దొంగను తల తీసెయ్యమంటే నువ్వెందుకు ఏడుస్తావు?" అని రాజు అడిగాడు.

"మహారాజా, ఈ దొంగను చంపి తమరు దేశానికి మహోపకారం చేస్తున్నారు, కాని ఉపకార నేరానికి గురి అవుతున్నారు," అన్నాడు మంత్రి.

రాజుకు జ్ఞానోదయమయింది. ఆయన ఉపకారులను విడిపించి, ఉపకార నేర శాసనం రద్దు చేయించి, దొంగకు మరణ దండన విధించాడు.





# చచ్చినదాని పిల్లలు

ఒక గ్రామంలో ఒక మనిషి ఒక స్త్రీని కోరి పెళ్ళి చేసుకున్నాడు. కాని వాళ్ళు ఏడాది పాటు కాపరం చేశాక ఆమె ఒక మగబిడ్డను కని, బాలింతరాలుగానే చనిపోయింది. ఆమెను పెట్టెలో పెట్టి పాతేసినాక, ఆమె తల్లి వైపు వాళ్ళు ఆ బిడ్డను సాకుతామన్నారు. కాని పిల్లవాడి తండ్రి అందుకు ఒప్పుకోక, తన బిడ్డను తానే పెంచుతానని పట్టుబట్టాడు. పిల్లవాడి సంరక్షణకు ఒక ముసలిదాన్ని తెచ్చి తన ఇంటనే ఉంచుకున్నాడు. ఇంట ముసలిదీ, బిడ్డా, వాడి తండ్రీ మాత్రమే ఉండేవారు. రాత్రిపూట ముసలిది పిల్లవాడి తొట్టెకు దగ్గరలోనే పడుకుని, అహోరాత్రాలు వాణ్ణి కనిపెట్టుకుని ఉండేది.

రెండు మాసాలు గడిచాయి. ఒకరోజు దీపాలు పెట్టాక ఇంటి యజమాని ఇంటికి తిరిగి వచ్చి, చంటిపిల్లవాణ్ణి తన చేతుల్లోకి తీసుకుని, "పిల్లవాడు చక్కగా ఎదుగుతున్నాడు. నీ పోషణ చాలా బాగున్నది," అని ముసలిదానితో అన్నాడు.

దానికా ముసలిది, "అసలు జరుగుతున్న సంగతి నీ కేం తెలుసు? నన్ను నువు తెచ్చిన దగ్గిర నుంచీ రోజూ చూస్తున్నాను: ప్రతి రాత్రీ వాడి తల్లి వచ్చి, అలమారులో నుంచి ఆహారం తీసుకుని తిని, పాలు తాగి, తొట్టెలో నుంచి పిల్లవాణ్ణి తీసుకుని, వాడికి పాలిచ్చి, ఒళ్ళంతా తుడిచి, బట్టలు మార్చి, పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకుని, తొట్టెలో పడుకోబెట్టి వెళ్ళిపోతున్నది. ప్రతి రాత్రీ ఆమెను చూస్తూనే ఉన్నాను, కాని పలకరించటం లేదు," అన్నది.

"నాకీ సంగతి మాటమాత్రం తెలిస్తే ఆమెను వెళ్ళిపోనివ్వక పోదును, కనీసం ఉంచెయ్యటానికి ప్రయత్నం చేసి ఉందును," అన్నాడు యజమాని.

బి. అనంతనారాయణ

"ఇప్పు డేం మించిపోయింది? ఇవాళ రాత్రి మేలుకుని ఉండు. ఆమె వచ్చినప్పుడు దగ్గుతాను," అన్నది ముసలిది.

ఆ రాత్రి అతను తన గదిలో మేలుకునే పడుకున్నాడు. బాగా పొద్దు పోయినాక తలుపు తోసిన చప్పుడు వినిపించింది. తరవాత చచ్చిపోయిన మనిషి లోపలికి వచ్చి, తొట్టెలో పిల్లవాణ్ణి ముద్దుపెట్టుకుని, అలమారు వద్దకు వెళ్ళి, ఉడికించి ఉంచిన ఉర్లగడ్డలూ, పాలూ తీసి, వాటిని తిని, తాగింది. తరవాత ఆమె చలిమంటను ఎగదోసి, చలితో బాధ పడుతున్నదాని లాగా చేతులు కాచుకుని, తొట్టె వద్దకు వచ్చి, పిల్లవాణ్ణి ఎత్తుకుని, వాడికి పాలిచ్చి, వాడి ఒళ్ళంతా శుభ్రం చేసి, పక్క బట్టలు మార్చింది. తరవాత ఆమె నిలబడి, తన భర్త ఉన్న పడకగది కేసి చూసి, నిట్టూర్చింది. ఆ సమయంలో ముసలిది దగ్గింది. చచ్చిపోయిన మనిషి వెళ్ళిపోయింది.

"మేలుకుని ఉన్నావా?" అని అడిగింది ముసలిది.

"మేలుకునే ఉన్నాను," అంటూ యజమాని తన గదిలో నుంచి ఇవతలికి వచ్చాడు.

"ఆమెను చూశావా?" అని ముసలిది అడిగింది.

"చూశాను గాని, దగ్గిరికి వెళ్ళటానికి భయం వేసింది," అన్నా డతను.

తెల్లవారినదాకా అతనికి నిద్ర రాలేదు. తెల్లవారగానే అతను అత్తవారింటికి వెళ్ళాడు. అతని అత్తమామలూ, ముగ్గురు బావ



మరుదులూ పిల్లవాడి యోగక్షేమాలు అడిగారు. అతను వాళ్ళతో రోజూ తన ఇంట రాత్రివేళ జరుగుతున్న కథ చెప్పాడు.

"నిన్న రాత్రి నేనామెను కళ్ళారా చూశాను, ఆమె వెళ్ళిపోకుండా అపుదామనుకున్నాను గాని, భయంతో చెయ్యీ కాలూ ఆడలేదు," అన్నాడతను.

"ఎంత పొరపాటు చేశావు? నేనక్కడ ఉంటే దాన్ని వెళ్ళిపోనివ్వకపోదును," అన్నాడు అతని పెద్ద బావమరిది.

"అయితే నావెంట రా. ఈ రాత్రి వచ్చినప్పుడు మీ చెల్లెల్ని పట్టుకుందువుగాని," అన్నాడు చచ్చిపోయినదాని భర్త.

ఇద్దరూ కలిసి చచ్చిపోయిన దాని భర్త ఇంటికి వచ్చారు. ఆ రాత్రి పెందలాడే వాళ్ళు పడక గది చేరి, చచ్చిపోయిన దాని రాకకోసం ఎదురు చూడసాగారు.

మామూలు వేళకే ఆమె తలుపు తోసుకుని లోపలికి వచ్చి, చలిమంట వద్ద చేతులు వెచ్చ బెట్టుకుని, అలమారులో నుంచి తీసుకుని ఆహారం తిని, పాలు తాగి, తొట్టె నుంచి బిడ్డను తీసుకుని, వాడికి పాలిచ్చి, వాణ్ణి శుభ్రం చేసి, పక్క బట్టలు మార్చి, పడుకోబెట్టి, తన భర్త గదికేసి చూసి, నిట్టూర్చి, బయటికి వెళ్ళిపోయింది.

"మీరు నిద్ర పోతున్నారా?" అని ముసలిది కేక పెట్టింది.

ఇద్దరూ గదిలో నుంచి బయటికి వచ్చారు.

"మీలాటి పిరికి మనుషులను నేనెక్కడా చూడలేదు," అన్నది ముసలిది.



మర్నాడు రెండో బావమరది వచ్చాడు. కాని వాడుకూడా తన చెల్లెలిని సమీపించ టానికి భయపడిపోయాడు.

అప్పుడు మూడోవాడు, "నేనుంటే దాన్ని పోనిచ్చి ఉండను," అన్నాడు.

ఆ మర్నాడు రాత్రి ముగ్గురు బావమరు దులూ తమ బావగారి ఇంటికి వచ్చి, గదిలోకి చేరారు. మూడో బావమరిది గది వాకిలికి దగ్గిరగా పడుకున్నాడు. అమె రావటం నలుగురూ చూశారు. అమె వచ్చి, చేతులు వెచ్చబెట్టుకుని, ఉడికిన ఉర్లగడ్డలు తిని, పాలు తాగి, పిల్లవాడికి పాలిచ్చి, ఒళ్ళు శుభ్రం చేసి, పక్క బట్టలు మార్చి, పిల్ల వాణ్ణి తొట్టెలో పడుకోబెట్టేముందు ఒకటికి మూడుసార్లు ముద్దు పెట్టుకుని, వాణ్ణి తొట్టెలో ఉంచి, లేచి నిలబడింది.

ఆ సమయంలో మూడోవాడు గది బయ టికి పరిగెత్తుకుంటూ వచ్చి ఆమెను పట్టు కున్నాడు. "వదులు, వదులు," అంటూ అమె వాడితో బలంగా పెనగులాడింది. వాడు మాత్రం ఆమెను వదలలేదు. ఈలోగా వాడి అన్నలు వచ్చి, ఆమెను పట్టేశారు. "నేను వెళ్ళాలి, లేకపోతే నన్ను చంపేస్తారు!" అని అరిచి, ఆమె మూర్ఛపోయింది.

మర్నాడు తెల్లవారి ఆమెకు స్పృహ వచ్చాక అమె జరిగిన సంగతి చెప్పింది. ఆమె నిజంగా చావలేదు. ఆమె చావు పిశాచాల కల్పన. ఆమెను పాతేశాక ఆమె పిశాచాల అధీనం అయింది. పిశాచాలు ఆ ప్రాంతంలో ఉన్నంతకాలమూ ఆమె తన బిడ్డను చూసుకో గలిగింది. కాని పిశాచాలు ఆమెతో సహా దూర ప్రాంతానికి తరలి పోతున్నాయి. అందుచేత ఆమె ఆఖరుసారి తన పిల్లవాణ్ణి చూసుకోవటానికని వచ్చి, తన అన్నలకు చిక్కింది. ఆ రోజు వాళ్ళు ఆమెను పట్టుకోకపోతే ఆమె మరి కనిపించి ఉండేది కాదు.

ఆమెను పట్టిన పిశాచాలు వెళ్ళిపోయి ఉండాలి. ఆమె తిరిగి తన భర్తతో మామూలు గానే కాపరం చేసి, తొమ్మిదిమంది పిల్లలను కన్నది. ఆ పిల్లలను ఊళ్ళోవాళ్ళు మాత్రం, "చచ్చినదాని పిల్లలు," అనేవాళ్ళు.







# 8

[ గణలింగేశ్వరుడు, తాను తెచ్చిన కన్యను పులికి ఆహారంగా వెయ్యాలని చూశాడు. కాని ఖడ్గవర్మ ఆమెను కాపాడి, డేరాలో నుంచి తీసుకువచ్చాడు. తరవాత అతడూ, జీవదత్తుడూ ఆమెను వెంట బెట్టుకుని బయలుదేరారు. గణలింగేశ్వరుడు మరొక కన్యను పట్టుకు వచ్చేందుకు తన శిష్యుల్ని ప్రయాణం కమ్మన్నాడు. తరవాత—]

గణలింగేశ్వరుడి ఆజ్ఞ కాగానే భైరవులందరూ ప్రయాణ మయారు. ఈసారి గణలింగేశ్వరుడు దాపుల కనబడుతున్న ఒక కొండ కేసి తన ముఠాను నడిపించాడు. ఆ కొండ కింద ఏవో పల్లెపట్లు వుండకపోవనీ, సూర్యోదయ వేళకు ఆ ప్రాంతాలు చేరితే, పొలం పనుల మీద వెళ్ళే కుటుంబీకులలో, తమకు కావలసిన కన్య దొరక్కపోదనీ అతడి ఆలోచన.

భైరవుల గుంపుకు ముందుగా, ఇద్దరేసి భైరవులు చెరొక వైపునా పోతూ, దారిలో ఏ రాజభటుల నుంచో లేక గ్రామస్తుల నుంచో ప్రమాదం వాటిల్లకుండా హెచ్చరిక యిస్తూంటారు. అలా ముందుకు పోయిన ఇద్దరు భైరవులకు సూర్యోదయం వేళ ఒక చెట్టు కింద కూర్చుని ఒక యువకుడూ, ఒక బాలికా కనిపించారు. యువకుణ్ణి మాత్రం వాళ్ళేనాడూ చూసి వుండ



లేదు. బాలిక మాత్రం రాత్రి పులితోపాటు మాయమైన కన్యాభైరవి!

"వీడెవడో కామరూపి! రాత్రి పులి రూపంలో వచ్చి కన్యను అపహరించాడు!" అన్నా డొక భైరవుడు.

"ఇలాంటి కామరూపుల్ని మహా భక్తుడైన మన గురువు రుద్రాక్షలుగా మార్చి మెడలో వేసుకోగలడు! సరే, మనం గురువుకు యీ సంగతి చెపుదాం!" అన్నాడు రెండో భైరవుడు.

భైరవు లిద్దరూ వెనుదిరిగి పరుగుపరుగున గణలింగేశ్వరుడి దగ్గిరకు వచ్చి, తాము చూసింది చెప్పారు. గణలింగేశ్వరుడు పొందిన ఆశ్చర్యం అంతా యింతా కాదు.

"నిశ్శబ్దంగా పోయి వాళ్ళను చుట్టుముట్టండి. కొందరు వాళ్లున్న చెట్టుకొమ్మల్ని ఆక్రమించటం మంచిది. ఒకవేళ వాడు మాంత్రికుడైతే పై కెగిరిపోకుండా పట్టుకోవచ్చు!" అన్నాడు గణలింగేశ్వరుడు.

భైరవు లందరూ బయలుదేరి కన్యా, యువకుడూ వున్న చోటు చేరి, వాళ్ళను చుట్టుముట్టి పట్టుకునేందుకు అన్ని వైపుల నుంచీ, నిశ్శబ్దంగా వాళ్ళ కేసి నడిచారు.

దాపుల నున్న చెట్ల మీది నుంచి వాళ్లున్న చెట్టు కొమ్మల్లోకి చేరేందుకు కొందరు భైరవులు, కోతుల్లా పైకి పాకసాగారు.

అరణ్యంలో చాలాదూరం నడవటం వల్ల కలిగిన బడలిక చేత, బాలిక చెట్టు బోదె నానుకుని కునికిపాట్లు పడుతున్నది. ఆమెకు కొంచెం దూరంగా జీవదత్తుడు తన దండం మీద గడ్డం ఆనించి కూర్చుని, ఏదో ఆలోచిస్తున్నాడు. అతడికి కన్యాభైరవిని ఆమె తండ్రి దగ్గిరకు చేర్చటం ఎలా అన్నది, సమస్యగా పరిణమించింది. ఇక ఖడ్గవర్మ ఆ దాపుల్లో లేడు. అతడికి తూర్పున సూర్యోదయ చిహ్నాలు కనబడగానే, విల్లంబులు సంపాయించటం అవసరం అన్న అభిప్రాయం కలిగింది. ఆ పగలు తాము ఎలాంటి శత్రువులను ఎదుర్కోవలసి వుంటుందో వూహించటం కష్టం. దూరాన్నుంచే శత్రువుల్ని హతమార్చటానికి విల్లూ, బాణాలూ

తయారు చేస్తూ, అతడొక సెలయేటి ఒడ్డున కూర్చునివున్నాడు.

అదమరిచి వున్న జీవదత్తుణ్ణీ, గ్రామాధికారి కూతుర్నీ పట్టుకోవటం భైరవ భక్తులకు చాలా తేలిక పనయింది. హఠాత్తుగా కొందరు చెట్ల చాటునుంచి వాళ్ళ మీదికి వచ్చి పడ్డారు. మరికొందరు చెట్లకొమ్మలు పట్టుకుని వేళ్ళాడుతూ, "రాత్రి పులిరూపంలో వచ్చిన మాంత్రికుడా, జాగ్రత్త! పైకెగిరావో, కాళ్ళూ చేతులూ విరిచి కిందపడేస్తాం!" అన్నారు.

జీవదత్తుడు దండం తీసుకొని లేవబోయే లోపలే అతణ్ణి నలుగురైదుగురు భైరవులు గట్టిగా ఒడిసిపట్టుకున్నారు. గ్రామాధికారి కూతురు పారిపోయే ప్రయత్నం చేయలేదు. ఆమె నిర్భయంగా చెట్టు నానుకుని నిలబడి గణలింగేశ్వరుడి కేసి చూస్తూ వూరుకున్నది.

గణలింగేశ్వరుడు గుర్లురుముతూ, "కన్యాభైరవీ! రాత్రి పులిరూపంలో వచ్చి, నిన్ను అపహరించి తెచ్చినవాడు వీడేనా?" అని అడిగాడు, జీవదత్తుణ్ణి చూపుతూ.

"ఈయన పులిరూపంలో రాలేదు. ఇప్పుడున్న రూపంలోనే నాకు మీ గుడారాల ప్రాంతాన కనిపించాడు. నాకై నేనే ఆయన వెంట మా గ్రామానికి బయలుదేరాను," అన్నది గ్రామాధికారి కూతురు.

"అయ్యో, పిచ్చిభైరవీ! ఇంకా మీ గ్రామం అక్కడున్నదనుకుంటున్నావా?



అడవి దొంగలముఠా ఒకటి మీ గ్రామంమీద పడి దోచుకుని, అందర్నీ చంపి ఇళ్ళకు నిప్పు పెట్టేశారు. ఆ సమయంలో నువ్వు గ్రామానికి దూరంగా కొలను దగ్గిరవుండి మాకు దొరికి బతికిపోయావు!" అన్నాడు గణలింగేశ్వరుడు.

"నేను భైరవిని కాను. నా పేరు భవాని! నన్నూ, యీయన్నీ వదిలి, మీ దారిన మీరు పొండి," అన్నది గ్రామాధికారి కూతురు కోపంగా.

"నీ పేరు భవాని అని తెలిసే నిన్ను భైరవిని చేయదలిచాం," అంటూ గణలింగేశ్వరుడు జీవదత్తుడి కేసి పళ్ళు కొరుకుతూ చూసి, "అదుగో, ఆ కనబడే




కొండల మీద భైరవాలయం నిర్మించబోతున్నాం. ముందు వీణ్ణి ఆ స్థానంలో బలియివ్వవలసివుంది. ఆ పని నువ్వు చేయాలి. ఆ తరవాత కట్టబోయే ఆలయానికి నువ్వు పూజారిణి వయిపోతావు," అన్నాడు.

జీవదత్తుడికి గురువు మాట్లాడేధోరణి చూస్తుంటే అసహ్యం పుట్టుకు రాసాగింది. కాని, యింత మందిని తానొక్కడే యిప్పుడు ఎదిరించటం ప్రమాదకరం. బహుశా ఖడ్గవర్మ దూరాన్నుంచి అంతా చూసి, సహాయపడేందుకు తగు ప్రయత్నాలు చేస్తూవుంటాడని అతడు అనుకున్నాడు.

జీవదత్తుడు అనుకున్నట్టే ఖడ్గవర్మ తన మిత్రుడున్న చెట్ల ప్రాంతాన్నుంచి పెద్ద కలకలం లేవటం విన్నాడు. ఆ సమయానికి సూర్యోదయం అయింది. ఖడ్గవర్మ ఒక బలమైన విల్లూ, కొన్ని అంబులూ తయారు చేసి, జీవదత్తుడున్న చోటుకు బయలుదేరాడు. అంతలో అతడికి భైరవుల అరుపులు వినిపించినై. ఏమి జరిగిందో చూసేందుకు అతడొక చెట్టు ఎక్కాడు. అక్కణ్ణించి అతడికి జీవదత్తుణ్ణి చుట్టుముట్టి పట్టుకున్న భైరవులూ, గ్రామాధికారి కూతురితో మాట్లాడుతున్న గురువూ కనిపించారు.

ఆ సమయంలో తను భైరవులను ఎదిరించటం వల్ల మేలుకన్న కీడే ఎక్కువ కలిగేప్రమాదం వున్నదని ఖడ్గవర్మ అనుకున్నాడు. భైరవులు తన మిత్రుణ్ణీ, బాలికనూ వెంటబెట్టుకుని ఏ మార్గాన పోతారో చూసి, వాళ్ళను అనుసరించిపోయి, వీలయినప్పుడు వాళ్ళను హతమార్చి, మిత్రుణ్ణీ, బాలికనూ బంధవిముక్తుల్ని చేయాలని అతడు నిర్ణయించుకున్నాడు.

గణలింగేశ్వరుడు తన శిష్యులతో దాపులనున్న కొండల కేసి బయలుదేరాడు. ఇద్దరు భైరవులు త్రిశూలాలు ఊపుకుంటూ అందరికన్న ముందు నడుస్తున్నారు. చెట్టు మీద నుంచి యిది చూసిన ఖడ్గవర్మ తాను, ఆ ఇద్దర్నీ అనుసరించి పోతే, మొత్తం భైరవముఠా పొదలిచిన ప్రదేశం కనుక్కోవచ్చనుకున్నాడు.



ఖడ్గవర్మ చెట్టు మీదినుంచి కిందికిదిగి భైరవులకు కనబడకుండా వాళ్ళను అనుసరించి నడవసాగాడు. అలా కొంతదూరం నడిచి అతడు కొండపాదం చేరాడు. భైరవులందరూ కొండ ఎక్కసాగారు. ఆ ప్రదేశంలో చెట్లు అంతగా లేవు. ఖడ్గవర్మ తాను వాళ్ళను అనుసరించేందుకు రాళ్ళచాటుగా నక్కుతూ పోవటం ఒక్కటే మార్గమని గ్రహించాడు. ఇది కొంత ప్రమాదంలో కూడినపని; భైరవుల కంటబడే ప్రమాదం వున్నది.....

ఖడ్గవర్మ యిలా ఆలోచిస్తూ చెట్టు చాటు నుంచి బయిటికి వచ్చేంతలో, చుట్టూవున్న పొదల మాటునుంచి పదీపన్నెండు మంది మనుషులు ఒక్కసారిగా బయిటికి వచ్చి, చేతుల్లోవున్న యీటెలను అతడి కేసి గురి చేశారు. వాళ్ళు తాము లోగడ విడిచివచ్చిన గ్రామస్తులని ఖడ్గవర్మ గుర్తించాడు. వాళ్ళల్లో తలారి వాళ్ళిద్దరు కూడా వున్నారు. ఒక యువకుడి చేతిలో పెంపుడు ఎలుగుబంటు ఒక టున్నది. వాడు ఎలుగుబంటుతో ఖడ్గవర్మను సమీపిస్తూ, "పారిపోజూశావే, దీన్ని ఉసిగొలిపి నీ తల కొబ్బరిబొళ్ళాంలా శపీమని పగిలేలా కొరికిస్తాను!" అన్నాడు.

"తొందరపడి ఆ వెధవ పనిచేయకు. నేనూ మీరూ కూడా ప్రమాదంలో చిక్కుకునివున్నాం. మీ గ్రామపెద్దా, లెక్కలురాసే ముసలి పిశాచం ఎక్కడ?" అని అడిగాడు ఖడ్గవర్మ.

ఎలుగుబంటువాడు జవాబిచ్చే లోపలే, ఒక పొదలో నుంచి గ్రామాధికారీ, గణకుడూ తలలు బయటికిపెట్టి, "ఆ కత్తి లాగేసుకోండి! ఆ రెండో వాడెక్కడ?" అన్నారు.

"అయ్యా గ్రామపెద్దలూ! నా బోటి వాడి నుంచి కత్తిలాక్కోవటం, మీ గ్రామంలో వీధిన పోయేవాడి భుజంమీంచి పై పంచ లాక్కోవటం అంత తేలిక అనుకుంటున్నారేమో, కాదు! గొడవ చెయ్యకుండా ముందు నే చెప్పేది వినండి! నా స్నేహితుణ్ణీ, మీ కుమార్తెనూ భైరవభక్తులు బందీలను చేసి, అదుగో, ఆ కొండ మీదికి తీసుకు పోతున్నారు. మీరంతా నే చెప్పినట్టు వింటే,

వాళ్ళిద్దర్నీ రక్షించవచ్చు!" అన్నాడు. ఖడ్గవర్మ.

"అయ్యో, మా భవాని! ఎంత అదృష్టం, ఇంకా బతికేవున్నదా? వాళ్ళ అమ్మ పోరు పడలేక, దాన్ని వెతుకుతూ అరణ్యంలోకి వచ్చాం. నువ్వు తటస్థపడ్డావు. నీ మాటలు నమ్మవచ్చా?" అన్నాడు గ్రామాధికారి.

"ఖడ్గవర్మను నమ్మి చెడ్డవాడు లేడన్నది మా గ్రామ ప్రాంతాలవున్న సామెత! రాత్రి నీ కూతుర్ని భైరవుల గురువు పులికి ఆహారంగా వేయచూశాడు. నేనూ నా మిత్రుడూ కాపాడి, యీ ప్రాంతాలకు తెచ్చాం. నేను లేనిసమయంలో ఆ భైరవులు వాళ్ళిద్దర్నీ పట్టుకుని కొండమీదికి తీసుకు పోతున్నారు. అదీ సంగతి! ఒక ఉపాయం ఆలోచించాను. నా వెంటరండి!" అన్నాడు ఖడ్గవర్మ.

గ్రామాధికారికి ఆ మాటల్లో నమ్మకం కుదిరింది. అతడు ఖడ్గవర్మ దగ్గిరకు వచ్చాడు. అతడికి వెనగ్గా నిలబడిన గణకుడు మాత్రం ఖడ్గవర్మ కేసి అనుమానంగా చూస్తూ, "నిన్ను నమ్మటం ఎలా? రాత్రి గ్రామం మీదికి ఏనుగుల్నీ, పులుల్నీ పంపకం చేశావే! నువ్వు మంత్రతంత్రాలు నేర్చిన వాడిలా వున్నావు!" అన్నాడు.

"అసందర్భపు మాటల్తో పూరికే కథ పెంచక, నే చెప్పినట్టు విని, నా వెంటరండి! అదుగో, భైరవులు కొండ ఎక్కుతున్నారు.



నా మిత్రుడూ, ఆ పక్కనేవున్న అమ్మాయీ కనుబడుతున్నారా?" అన్నాడు ఖడ్గవర్మ.

గ్రామాధికారీ అతడి వెంటవున్న వాళ్ళూ అటుకేసి చూశారు. గ్రామాధికారి తన కుమార్తెను చూస్తూనే, ఆవేశపడిపోతూ, "రండి! ఆ దుర్మార్గుల్ని పట్టుకుని చెట్లకు విరిచి కట్టి, ఈటెలతో పొడిపిద్దాం!" అంటూ బయలుదేరాడు.

ఖడ్గవర్మ అతడి భుజం పట్టుకుని ఆపి, "ఆ దుర్మార్గులు నిరాయుధులు కారు, వాళ్ళదగ్గిర త్రిశూలాలు వున్నయ్. నా వెంట రండి. రాళ్ళచాటుగా వాళ్ళను వెన్నంటి పోయి, అవకాశం దొరికినప్పుడు హఠాత్తుగా మీద పడదాం!" అన్నాడు.

ఖడ్గవర్మ చెప్పినట్టు గ్రామాధికారీ, అతడి అనుచరులూ మరో మార్గాన కొండ ఎక్క సాగారు. కొంత సేపటికి భైరవుల ముఠా కొండమీద సమతలంగావున్న ఒక ప్రదేశాన్ని చేరారు. వాళ్ళ గురువు గణలింగేశ్వరుడు, అక్కడ అందర్నీ ఆపి, చుట్టూ ఓమారు కలయచూసి, "ఈ ప్రదేశం భైరవాలయ నిర్మాణానికి మహాప్రశస్తంగా వుంది. ఇదిగో, యీ రాతిమీద ముందుగా వీణ్ణి బలియిచ్చి, తరవాత ఆలయ నిర్మాణం ప్రారంభిద్దాం! కన్యాభైరవి యీ కత్తితో వీడి గుండెలను చీల్చి రక్తతర్పణం చేస్తుంది!" అంటూ చిన్న కత్తిని భవానికి యివ్వబోయాడు.

భవాని రౌద్రావేశంతో గణలింగేశ్వరుడివ్వ చూపిన కత్తిని విసురుగా పక్కకు తోసి, "ఛీ, దుర్మార్గుడా! నే నెవర్ననుకున్నావు? నా చేత హత్యలు చేయించాలనుకుంటున్నావా? జాగ్రత్త. నన్నూ, యీయన్నీ యిప్పుడే వదిలి నీ దారిన నువ్వు పోకపోయ్యావో, ఏదో ఒకనాడు ఆ కత్తితో నేనే నీ గుండెలు చీల్చుతాను!" అన్నది.

"ఆహాః, పౌరుషం గల కన్య! భైరవిగా పని కొస్తుంది. సరే, ముహూర్తం దాటిపోతున్నది గనక, నేనే వీడి గుండెలు చీల్చి, భైరవాలయ నిర్మాణానికి ఉపయుక్తంగా యీ ప్రదేశాన్ని పవిత్రం చేస్తాను!" అన్నాడు గణలింగేశ్వరుడు.

గణలింగేశ్వరుడు పిడికిట కత్తిని గట్టిగా బిగించి, చేయెత్తి పెద్ద గొంతుతో ఏవో మంత్రాలు చదవసాగాడు. రాళ్ళ చాటున వుండి ఇదంతా చూస్తున్న ఖడ్గవర్మ, ఎలుగు బంటును వెంట తెచ్చిన పల్లె యువకుడితో, "ఏదీ నీ పెంపుడు ఎలుగును, ఆ గడ్డం పిశాచి మీదికి ఉసికొల్పు! ఏం జరుగుతుందో, చూద్దాం," అన్నాడు.

పల్లెయువకుడు ఎలుగుబంటుకు గణలింగేశ్వరుణ్ణి చూపుతూ, "దూకు జాంబవంతా! వాడి తల కొరుకు!" అన్నాడు.

ఆ వెంటనే ఎలుగుబంటు పెద్దగా గాండ్రిస్తూ, రాళ్ళ చాటు నుంచి గణలింగేశ్వరుడి భైరవగుంపు మీదికి దూకింది!

—(ఇంకా వుంది)





# మూడు గండాలు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టు పై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవం లోని బేతాళుడు, "రాజా, నీ సాహసం ప్రశంసనీయమే గాని, ఎంతటి సాహసి కూడా విధిని జయించలేడు. ఇందుకు నిదర్శనంగా నీకు సుమంతుడి కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను." అంటూ ఇలా చెప్పసాగాడు :

శోణానదీ తీరాన గల శోణాపురాన్ని శాంతివర్మ పాలించేవాడు. ఆయనకు లేక లేక ఒక కొడుకు కలిగాడు. అతనే సుమంతుడు. తన అనంతరం రాజ్యం చెయ్యటానికి కొడుకు పుట్టాడు గదా అని శాంతి వర్మ ఎంతో సంతోషించి, గొప్ప ఉత్సవాలు జరిపించాడు. ఆ సందర్భంలో వచ్చిన గొప్ప జ్యోతిష్కులు పిల్లవాడి జాతక చక్రం

## బేతాళ కథలు



చేసి, తెల్లమొహాలు వేశారు. రాజు అది చూసి కలతపడి, "అబ్బాయి జాతకంలో విశేషం ఏమన్నా ఉన్నదా?" అని అడిగాడు.

"ఈ కుర్రవాడికి మొసలి వల్ల కాని, పాము వల్ల కాని, కుక్క వల్ల కాని గండం ఉన్నది," అన్నారు జ్యోతిష్కులు.

రాజుకు మతి పోయినట్టయింది. కాని అయన నిరాశ చెందక, సుమంతుణ్ణి కుక్కలకూ, పాములకూ, మొసళ్ళకూ దూరంగా ఉంచటానికి ఎన్నో మార్గాలు ఆలోచించాడు. చివర కాయన, నగరం మధ్య ఉన్న గుట్ట మీద ఒక ఇల్లు కట్టించాడు. అందులోకి చీమ కూడా దూరటానికి అవకాశం లేకుండా కట్టుదిట్టం చేసి, కాపలా వాళ్లనూ, దాస దాసీలనూ ఏర్పాటు చేసి, సుమంతుడు ఆ భవనంలోనే ఏ లోటూ లేకుండా పెరిగి పెద్దవాడు కావటానికి అవసరమైనదంతా అమర్చాడు. గుట్ట దిగువన కందకం తవ్వించి, దాని మీద చిన్న వంతెన వేయించాడు.

ఈ భవనంలో సుమంతుడు ఏ లోటూ లేకుండా పెరిగి, నాలుగైదు ఏళ్ళవాడయాడు. అతనికి కావలసిన ఆటవస్తువులన్నీ ఉండేవి. సాయంకాలం వేళ ఇంటి మిద్దె మీద పరుగులు తీసేవాడు. అతని జీవితం ఆనందమయంగా ఉన్నది.

ఒకనాడు సుమంతుడు మిద్దె మీద ఆడుకుంటూ కిందికి చూసేసరికి, అగడ్త అవతల ఒక కుక్కపిల్ల అటూ, ఇటూ పరిగెత్తి ఆడుకుంటూ కనబడింది. సుమంతుడు అప్పటిదాకా కుక్కను చూసి ఎరగడు, ఎందుచేతనంటే ఆ కుర్రవాడు ఆడుకునే బొమ్మలలో కూడా కుక్కలూ, పాములూ, మొసళ్ళూ లేకుండా చేశారు. అందుచేత అతను తన వెంట ఉన్న సేవకుడిని, "ఆ పరిగెత్తుతున్నది ఏమిటి?" అని అడిగాడు.

"అది కుక్క, అబ్బాయిగారూ!" అన్నాడు సేవకుడు.

"దాన్ని తీసుకురా. దానితో పరుగు పందెం వేస్తాను," అన్నాడు సుమంతుడు.

సేవకుడికి ఏం చెయ్యటానికీ పాలుబోక, రాజుతో చెప్పాడు.

"ఏం చేస్తాం? కుక్కపిల్లను తెచ్చి ఇయ్యి. లేకపోతే వాడు మనోవ్యాధి పడి పోతాడు!" అన్నాడు రాజు.

సేవకుడు కుక్కపిల్లను తెచ్చి సుమంతుడి కిచ్చాడు. సుమంతుడు దానితో ఆడు కుంటూ ఎంతో ఆనందించాడు. ఏళ్ళు గడి చాయి. సుమంతుడు పెరిగి పెద్దవా డయాడు. అతనికి అనేక విషయాలు తెలియవచ్చాయి. అతను ఒకనాడు తన తండ్రికి ఇలా కబురు చేశాడు: "ఈ గుట్ట మీది భవనంలో నే నింక ఉండలేను. ఇక్కడ నాకు జీవితం ఏమీ లేదు. నాకు గండాలున్నట్టు తెలుసు. ఇలా జీవించే కన్న చావటమే మేలు. అందుచేత నాకు అయుధాలు ఇప్పించినట్టయితే, నేనూ, నా కుక్కా దేశాల మీద పోతాము."

కొడుకు పంపిన ఈ సందేశం విని రాజు అభ్యంతరం చెప్పలేదు. రాజుగారు ఏర్పాటు చేసిన పడవ మీద సుమంతుడూ, అతని కుక్కా నది దాటి అవతలి ఒడ్డు చేరారు. అక్కడ అతని కోసం ఒక నల్ల గుర్రం సిద్ధంగా ఉన్నది. సుమంతుడు దాని మీద ఎక్కి జీవితాన్ని వెతుక్కుంటూ బయలుదేరాడు. అతని కుక్క గుర్రం వెన కగా పరిగెత్తింది.



వాళ్ళు అలా వెళ్ళి, వెళ్ళి, ఒక రాజ్యం చేరారు. ఆ దేశపురాజు అదొకరకం మనిషి. ఆయన తన ప్రజలను సుఖపెట్టే మార్గాలు ఆలోచించటానికి బదులు, కొత్త కొత్త సమస్యలూ, పరీక్షలూ ఆలోచించేవాడు. ఆయనకు ఒకే కుమార్తె సీమంతిని అనేది ఉండేది. ఆమె చాలా చక్కనిది. ఆమెకు యుక్త వయసు వచ్చేసరికి పెళ్ళి చెయ్య వలసి వచ్చింది. అప్పుడు రాజు, ఆమె భర్త కాబోయేవాడికి ఒక కఠిన పరీక్ష ఏర్పాటు చేశాడు.

ఆయన బండరాళ్ళతో డెబ్భై అడుగుల ఎత్తు గోడలు లేపి, ఆ ఎత్తున ఒక ఇల్లు కట్టించి, అందులో రాజకుమార్తెను ఉంచి,



ఆ గోడలు ఎక్కి ఆమెను చేరుకున్నవాడికి ఆమెనిచ్చి పెళ్ళి చేస్తానని చుట్టుపక్కల గల దేశాలలో చాటింపు చేయించాడు. సీమంతిని అందచందాలు ప్రసిద్ధికెక్కి ఉండటం చేత అనేకమంది రాజకుమారులు ఆమెను పెళ్ళాడాలని వచ్చారు. వారికోసం ఒక పెద్ద విడిదీ, భోజనం మొదలైన సౌకర్యాలూ ఏర్పాటయాయి.

అందులో చేరిన రాజకుమారులు, గుర్రంమీద వచ్చిన సుమంతుణ్ణి చూడగానే, అతను కూడా తమలాంటి వాడేనని గ్రహించి, అతన్ని విడిదిలోకి ఆహ్వానించారు.

సుఖంగా స్నానంచేసి, ప్రయాణపు బడలిక తీర్చుకున్నాక, రాజకుమారులు అతన్ని, "నువ్వు ఎక్కడినుంచి వస్తున్నావు? మీ తండ్రి ఎవరు?" అని ప్రశ్నించారు.

సుమంతుడు వారితో నిజం చెప్పక, తన తండ్రి తన దేశపు రాజుగారి వద్ద అశ్వపాలకుడనీ, తన తల్లి పోగా ఆయన తిరిగి పెళ్ళాడాడనీ, సవతి తల్లికి భయపడి తాను దేశాల మీద బయలుదేరాననీ, అబద్ధాలాడాడు.

తరవాత సుమంతుడు, "మీరంతా ఇక్కడ ఎందుకు చేరారు?" అని అడిగితే, వాళ్ళు రాజకుమార్తె కోసం జరుగుతున్న వరపరీక్ష గురించి చెప్పారు. చాలా రోజులుగా రాజకుమారు లందరూ రాతిగోడలు ఎక్కి రాజకుమార్తెను చేరటానికి ప్రయత్నిస్తున్నారు, కాని ఎవరూ నెగ్గలేదు.

సుమంతుడు తాను కూడా వాళ్ళతో పాటు ప్రయత్నించాలని నిశ్చయించుకున్నాడు. అతను వాళ్ళ వెంట వెళ్ళి, వాళ్ళ ప్రయత్నాలు ఎలా విఫలమవుతున్నాయో, రాతి గోడలలో కాలికీ, చేతికీ పట్లు ఎలా ఏర్పాటయి ఉన్నాయో శ్రద్ధగా గమనించాడు. అందరూ గోడదిగువ ఉన్న ఆధారాలనే ఉపయోగిస్తున్నారు. కాని కొంత ఎత్తుకు ప్రయాసపడి ఎక్కితే, మిగిలిన గోడ సులువుగా ఎక్కవీలు మరొక ప్రాంతంలో ఉన్నది. సుమంతుడు అక్కడ ఎక్కటం ప్రారంభించి, అందరూ చూస్తూండగానే రాజకుమార్తె ఉన్న చోటికి చేరాడు.

అది చూడగానే ఒక రాజకుమారుడు రాజు వద్దకు పరిగెత్తి పోయి, "మీరు పెట్టిన పరీక్షలో నెగ్గి ఒకడు మీ అమ్మాయిని గెలుచుకున్నాడు." అని చెప్పాడు.

"అతను ఏ దేశపు రాజకుమారుడు?" అని రాజు అడిగాడు.

"అతను రాజకుమారుడే కాడు!" అన్నాడు కబురు తెచ్చిన రాజకుమారుడు.

ఈ మాటవిని రాజుకు చాలా కోపం వచ్చింది. "వీల్లేదు! వాణ్ణి తక్షణం సాగనంపండి!" అని ఆయన చిందులు తొక్కాడు.

రాజకుమారుడు తిరిగి వచ్చి, రాజు అన్న మాటలు అనుచరులకుచెప్పాడు. ఈమాటలు రాజకుమార్తె విని, "ఈ యువకుణ్ణీ, నన్నూ వేరు చేస్తే నేను ఆహారమూ, నీరూ ముట్టనని మా తండ్రికి చెప్పండి." అన్నది. ఈ సంగతి తెలిసి రాజు మరింత మండి పడి, పోటీలో గెలిచిన వాణ్ణి చంపి రమ్మని తన భటులను పంపాడు.

"ఇతనికి చిన్నగాయం అయిందో, నేను ఈ కిటికీలో నుంచి కిందికి దూకేస్తాను," అన్నది సీమంతిని. భటులు ఏమీ చేయలేక తిరిగి వెళ్ళారు.

రాజు తన కుమార్తెనూ, సుమంతుణ్ణీ తన వద్దకు పిలిపించుకున్నాడు. రాజు, "నువు ఎవరు?" అని అడిగితే సుమంతుడు మొదట చెప్పిన కట్టు కథే చెప్పాడు. రాజు అతనికీ, సీమంతినికీ పెళ్ళి చేశాడు.

కొద్ది వారాలు గడిచాక సుమంతుడు తన భార్యతో, "నాకు మొసలి మూలానో, పాము





మూలానే. ఉత్తరమూలానే గండం ఉన్నది." అని చెప్పారు.

"అలా అయితే ఆ దిక్కుమాలిన కుక్కను వెంటవేసుకుని తిరగటం దేనికి? చంపెయ్యరాదా?" అన్నది సీమంతిని.

"అది చిన్నప్పటి నుంచీ నాతో కలిసి ఆడుకున్నది. దాన్ని చంపటమేమిటి?" అన్నాడు సుమంతుడు.

"అలా అయితే, ఎక్కడికి వెళ్ళినా వెంట కత్తీ, మనిషితోడూ లేకుండా వెళ్ళవద్దు." అన్నది సీమంతిని. సుమంతుడు సరే నన్నాడు.

కొద్ది నెలలు గడిచాయి. సుమంతుడి తండ్రి అయిన శాంతివర్మ చాలా జబ్బుగా ఉన్నాడనీ, తన ఒక్క కొడుకు కోసమూ కలవరిస్తున్నాడనీ తెలిసింది. తన తండ్రిని ఒక సారి చూసివస్తానని భార్యతో చెప్పి, కొందరు భటులను వెంట తీసుకుని సుమంతుడు దేశానికి బయలుదేరాడు. మధ్య దారిలో అతనికి తన తండ్రి చావు బతుకుల మధ్య ఉన్నట్టు తెలియ వచ్చింది. తన నగరం చేరిన తరవాత వెంటనే బయలుదేరే అవకాశం లేకపోవచ్చు ననుకుని, సుమంతుడు ఒక నది ఒడ్డున మజిలీ చేసి, తన భార్యను పిలుచుకు రమ్మని మనిషిని పంపాడు.

ఆ రాత్రి సుమంతుడు తన గుడారంలో నిద్రపోతూండగా ఒక మొసలి నదిలో నుంచి గుడారంలోకి పాకుతూ వచ్చింది. అదృష్ట వశాన కాపలావాడు దాన్ని చూసి, కేకలు పెట్టాడు. భటులు నలుగురూ వచ్చి దాన్ని చంపారు.

సీమంతిని వచ్చి చేరటంలో చాలా జాప్యం అయింది. ఆమె వచ్చేదాకా సుమంతుడు కదలటానికి లేదు. అతనున్న ప్రదేశంలో మొసళ్ళ భయం జాస్తిగా ఉన్నది. అందుచేత అతను చాలా మెళుకువగా రోజులు గడుపుతూ వచ్చాడు.

చివరకు ఒకనాటి సాయంకాలం సీమంతిని వచ్చి చేరింది. మర్నాడు ప్రయాణం కొనసాగించటానికి నిశ్చయించుకున్నారు.



కాని ఆ రాత్రి సీమంతిని కన్ను మూయ లేకపోయింది. తన భర్తకు మొసలిగండం కొంచెంలో తప్పి పోయిందని విని ఆమె చాలా కలవరపడింది.

ఆమె కన్ను మూయలేకపోవటం మంచిదే అయింది. ఒక రాత్రివేళ ఆమె తమ గుడా రంలోకి పాము పాకుతూ రావటం చూసింది. ఆమెకు ఏం చెయ్యాలో తోచలేదు. ఒక మూల పెద్ద పాత్ర నిండా పాలున్నాయి. ఆ పాత్రను ఆమె పాము వచ్చే దారిలో ఉంచింది. పాము పాలవాసన పసికట్టి తల ఎత్తి పాత్రలో మూతి పెట్టి, అపురావు రున పాలన్నీ తాగేసి భుక్తాయాసంతో కదల లేక అక్కడే పడిపోయింది. అప్పుడు సీమంతిని తన భర్త కత్తి తెచ్చి, ఒక్క దెబ్బతో పాము మెడ నరికేసింది.

ఆ తరవాత వారిద్దరూ శోణాపురం చేరు కున్నారు. అప్పటికే శాంతివర్మ చనిపో యాడు. సుమంతుడు తండ్రికి ఉత్తరక్రి యలు జరిపి, రాజ్యాభిషేకం చేసుకున్నాడు.

రోజులు ప్రశాంతంగా గడిచిపోతున్నాయి. సుమంతుడు తన కుక్కను వెంట బెట్టు కుని తరచుగా నదీ తీరానికి వేటకు వెళ్ళే వాడు. అతను అలా వెళ్ళినప్పుడల్లా సీమం తిని అతని వెంట ఉండేది.

ఒక రోజు సుమంతుడు నది ఒడ్డున పిట్టలను వేటాడుతూ ఉండగా, ఒక పొదలో నుంచి పెద్ద అడవిబాతు ఒకటి ఇవతలికి వచ్చింది. దాన్ని చూడగానే, పట్టుకుందా మని కుక్క ముందుకు లంఘించి, తన యజమాని కాళ్ళ మధ్య చిక్కుకున్నది. సుమంతుడు తూలి, కుక్కతోసహా నదిలో పడ్డాడు. అతను పడిన చోట ఊబి, బురదగా ఉండటం చేత, అతను వాటిలో కూరుకు పోయి, కేకలు పెటాడు. సమీపంలోనే ఉన్న సీమంతిని పరిగెత్తుకుంటూ వచ్చి, తాను పైన కప్పుకున్న బట్ట అతనికి అందిం చింది. దాని సహాయంతో అతను ఒడ్డుకు వచ్చాడు. కాని కుక్కజాడ దొరకలేదు.

ఇది జరిగినాక జ్యోతిష్కులు సుమం తుడికి గండాలు గడిచాయన్నారు.

బేతాళుడీ కథ చెప్పి, "రాజా, నాకు అనేక సందేహాలున్నాయి. తన కొడుకును గండాలనుంచి కాపాడటానికి ఎన్నో ఏర్పాట్లు చేసిన శాంతివర్మ అతనికి కుక్కపిల్లను ఎందుకు ఇప్పించాడు? అతను దేశాల మీద పోతానంటే ఎందుకు పోనిచ్చాడు? సుమంతుడు తన మామకు తానెవరో నిజం చెప్పక అబద్ధాలెందుకు చెప్పాడు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి చెప్పకపోతే నీ తల పగిలి పోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "సృష్టిలో మరణ కారణం కానిదంటూ ఏదీ లేదు. జీవితంలో ప్రతి ఒకడికీ అనేకసార్లు గండాలు వెంట్రుక వాసిలో తప్పి పోతూనే ఉంటాయి. అదీ గాక చావు అన్నది చివరకు ఏదో రూపంలో అందరికీ వచ్చేదే. దాన్ని తప్పించుకోవటానికి జీవితమే లేకుండా చేసుకోవటం బుద్ధి తక్కువ. కాని శాంతివర్మ తన కొడుకును చావు నుంచి కాపాడాలని ఆ కుర్రవాడికి జీవితం లేకుండా చేశాడు. తన కొడుకు ఆనందానికి అడ్డురావటం ఆయన ఉద్దేశం కాదు. తానై ఆయన తన కొడుకుకు కుక్కపిల్లను ఇచ్చి ఉండడు. కాని వాడే కోరితే నిరాకరించ లేదు. ఆ కుక్కపిల్ల వల్ల వాడికి అపాయం కలిగితే దానికి తాను బాధ్యుడు కాదు. అలాగే, సుమంతుడు జీవితాన్ని వెతుక్కుంటూ బయలుదేరినప్పుడు కూడా ఆయన అడ్డు చెప్పలేదు. జ్యోతిష్కుడు చెప్పిన గండాలకు అడ్డుపడిన మనిషి సీమంతిని. అది కూడా సహజమే, ఎందుకంటే అతని జీవితాన్ని ఆమె పంచుకున్నది. ఇక, సుమంతుడు తనను గురించి ఎందుకు అబద్ధం చెప్పాడంటే, తాను ఫలానా దేశపు రాజకుమారుడని తెలిస్తే తన మామగారు బంధుత్వం పాటిస్తాడు. తన గండాలను గురించి తెలుసుకుంటాడు. అందువల్ల ఆయనకు నిష్ప్రయోజనమైన ఆందోళన కలగటం తప్ప మరేమీ ఉండదు," అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. (కల్పితం)





# "షరాబులు"

పోలండు దేశస్థులలో ఒక నమ్మకం ఉండేది. అదేమంటే, ఆ దేశంలోని గనులలో మనుషులలాటి భూతా లుండేవారని. వాటిని "షరాబులు" అని పిలిచేవాళ్ళు.

ఈ షరాబులు ఎన్నడూ భూగర్భంలో నుంచి పైకి వచ్చేవారుకారు; గనులలో పని చేసేవారితో కలిసి పని చేసేవారు, కష్టాలలో ఆదుకునేవారు. వాళ్ళు మామూలు మనుషుల కన్న చిన్నగా ఉండేవాళ్ళు. మంచి స్వభావాలు గలవాళ్ళకు అనేక విధాల సహాయపడేవాళ్లు; లోహపు మట్టి తక్కువగా ఉన్న చోట శ్రమపడుతున్నవారికి, సమృద్ధిగా ఉండే ప్రాంతాలు చూపేవారు.

వాళ్ళు చెడ్డవాళ్ళను సహించేవారు కారు; మరీ కోపం వచ్చినప్పుడు వాళ్ళు తవ్వే చోటినుంచి లోహన్ని మాయం చేసి, లోతుకు తీసుకుపోయేవాళ్ళు; లేదా, పై మట్టి విరిగి వాళ్ళ మీద పడేటట్టు చేసేవాళ్ళు. షరాబులు కనిపించనప్పుడు కూడా వాళ్ళ అలికిడి గనులలో వాళ్ళకు అప్పుడప్పుడూ వినిపించేది.

ఒక ఉప్పు గనిలో ఒక మేస్త్రీ ఉండేవాడు. ఆ గనిలో ఒక పనివాడు చచ్చిపోయినప్పుడు ఆ పనివాడి భార్యకు ఆ మేస్త్రీ పరిహారం చెల్లించక, ఆమె చచ్చిపోయినవాడి భార్య అని తనకు రుజువు లేదన్నాడు. ఆమె చచ్చినవాడి పెళ్ళామేనని ఇతర పనివాళ్ళు సాక్ష్యం చెప్పారు. కాని మేస్త్రీ వినిపించుకో లేదు. తరవాత వారం రోజులకు ఆ మేస్త్రీ ఒక సొరంగం కుండా నడుస్తూ ఉండగా పై కప్పు అతని మీద విరిగిపడి, అతను మరణించాడు.

యుద్ధ సమయాలలో ధనికులు తమ నిధులను ఈ ఉప్పు గనులలోనే దాచేవారట. అలాటి నిధులు కొన్ని శాశ్వతంగా గనులలోనే ఉండిపోయాయి. అవి కూడా షరా



బుల రక్షణలోనే ఉండినట్టు చెప్పుకునే వారు. వాటికోసం చాలామంది వెతకటానికి ప్రయత్నించారు, కాని అలా వెతుకుతూ ఉండే సమయంలో వారి చేతి దీపాలు అకారణంగా ఆరిపోతూ ఉండేవి.

ఒకసారి ఒక షరాబు ఇద్దరు గని పని వాళ్ళకు నిధి ఉన్న చోటు చూపిస్తానన్నాడు. షరాబు వెంట పోయేటప్పుడు ఒక పనివాడు ఒక కర్రను చెక్కుతూ, తడపలు కింద రాలుస్తూ వెళ్ళాడు. తరవాత దారి గుర్తు తెలుస్తుందని వాడి ఆశ. వాళ్ళు నిధిని కళ్ళారా చూశారు. కాని తిరిగి వచ్చేటప్పుడు చూసుకుంటే, కర్రపేళ్లు మాయమయాయి. అది చూసి రెండో పనివాడు సుద్దముక్కతో దారి వెంబడి గోడలమీద గుర్తులు పెట్టాడు. కాని అవీ మాయమయాయి. అందుచేత ఆ పనివాళ్ళు తాము చూసిన నిధిని మరెన్నడూ కళ్ళ చూడలేదు.

పోలండులో కెల్లా అత్యంత పురాతన మైనదీ, విస్తీర్ణమైనదీ ఒక గని ఉన్నది. అందులో షరాబులు హెచ్చు సంఖ్యలో ఉండేవారు. ఆ గనిని అనేక విభాగాలు చేసి, ఒక్కొక్క విభాగానికీ ఒక్కొక్క షరాబు ఉండేవాడు. ఆ విభాగంలో పని చేసేవారందరినీ ఆ షరాబు కనిపెట్టి ఉండే వాడు. పనివాళ్ళకు ఏదన్నా అన్యాయం జరిగితే తమను కనిపెట్టి ఉండే షరాబు న్యాయం జరిగిస్తాడని వాళ్ళు నమ్మేవారు.

ఒక పేద పని వాడుండేవాడు. వాడు ఎక్కువ శ్రమపడక, అస్తమానమూ తాగే వాడు. వాడికి మంచి గని ఇచ్చేవారుకారు. ఒకనాడు వాడు ఉదయం నుంచి శ్రమ పడినా ఒక్క పిసరు లోహం పడకపోయే సరికి, ఒక బండరాతి మీద కూర్చుని విశ్రాంతి తీసుకుంటూ, "నేను ఎలాటి దరిద్రుణ్ణి! నాకెవరి సహాయమూ లేదు. ఇలాటి చోట ఎంత శ్రమించి ఏం లాభం?" అని వాపోసాగాడు.

ఒక షరాబు వాణ్ణి పలకరించి, "నువు చేసుకోవటానికి ఇచ్చిన చోటంతా కలిపి ఇదేనా?" అని అడిగాడు.

''ఇంతకన్న మంచి చోటు నాకెవ రిస్తారు?'' అన్నాడు పనివాడు దీనంగా.

''నా వెంట రా. నీకు వెండిలోహం దొరికే చోటు చూపిస్తాను. నేను చెప్పినట్టు వింటే నీకు మంచి లాభం వస్తుంది. ధనికుడివి అయిపోతావు.'' అన్నాడు షరాబు.

పనివాడు షరాబు వెంట ఒక ప్రాంతానికి వెళ్ళాడు. ''ఇదుగో వెండి. నీకు కావలిసి నంత తవ్వుకో. నువు తవ్విన వెండి తూయించి, నీకు రావలసినది తీసుకున్న తరవాత, మనం మొదట కలుసుకున్న చోటికి రా. అక్కడ మనం డబ్బు పంచు కుందాం,'' అన్నాడు షరాబు.



పనివాడు సంతోషంగా తోటి పనివాళ్ళ వద్దకు వెళ్ళి, బోలెడు ముడివెండి ఉన్నది, తవ్వటానికి రమ్మన్నాడు.

''ఇక్కడి గనిలో సత్తు తప్ప ఏమీ లేదు. వెండి ఏనాడో షట్టిపోయింది. వెండి ఉన్న దంటున్నావు గనక, అదంతా నువే తవ్వుకో!'' అని వాళ్ళు యద్దేవా చేశారు.

కాని ఆ పనివాడు తాగుడు అలోచన కట్టి పెట్టి, ఒక నెల అంతా ముడివెండి తవ్వి, తన కూలి కింద అనేక వేల నాణాలు సంపా దించుకున్నాడు. ఆ నాణాలను ఒక తోపుడు తొట్టిలో పోసుకుని, మొదట తాను షరా బును కలుసుకున్న చోటికి వచ్చాడు. షరాబు వాడికోసం సిద్ధంగా ఉన్నాడు.

నాణాలు సమంగా పంచగా ఒక నాణెం మిగిలిపోయింది.

''ఈ చివరి నాణెం ఎవరికి?'' అని షరాబు అడిగాడు.

''అది నువే తీసుకో, బాబూ!'' అన్నాడు పనివాడు.

''నీకు డబ్బు కాపీనం పట్టలేదన్నమాట. అంతా నువే ఉంచుకో. కాని దానధర్మాలు చెయ్యటం మరవకు. ఇక ఎన్నడూ గను లలోకి రాకు,'' అని చెప్పి షరాబు వెళ్ళి పోయాడు.

పనివాడు జీవితాంతం దాకా దాన ధర్మాలు చేస్తూ, తాగుడు మానేసి, సుఖంగా జీవించాడు.



అదే గనిలో ఇంతకన్న విచిత్రమైన సంఘటన మరొకటి జరిగింది. ఇది జరిగినది కూడా ఒంటరి పనివాడికే.

ఒకనాడు వాడి కొక షరాబు కనిపించి, "ఒంటరిగా పనిచేస్తున్నావేం? నన్ను భాగస్తుడుగా కలుపుకుంటావా?" అని అడిగాడు.

దానికా పనివాడు, "ఇందులో లోహం చాలా తక్కువ. ఒక్కడికే కడుపు నిండదు. ఇద్దరం ఏం తింటాం?" అన్నాడు.

"మంచి చోటు నేను చూపిస్తాను, నా వెంట రా!" అంటూ షరాబు ఆ పనివాణ్ణి మరొక ప్రాంతానికి తీసుకుపోయాడు. అక్కడ ముడిలోహం పుష్కలంగా ఉన్నది. పనివాడు ఉత్సాహంగా దాన్ని తవ్వనారంభించాడు. కొద్దిసేపు అయ్యాక షరాబు వాణ్ణి భూగర్భంలో ఇంకా లోతుకు తీసుకుపోయాడు.

పనివాడు అలిసిపోయి, కాస్సేపు విశ్రాంతి తీసుకుంటానన్నాడు. అతను తన వద్ద ఉన్న రొట్టె తిని, నడుము వాల్చి కునుకు తీశాడు.

అతను నిద్ర లేచేసరికి షరాబు అక్కడే ఉంది. "ఎంతసేపు నిద్రపోయావో తెలుసా?" అని అడిగాడు.

"రెండుగంటలు పడుకుని ఉంటానేమో!" అన్నాడు పనివాడు.

షరాబు ఏమీ అనక, అతన్ని మరొక మార్గాన మొదటి చోటుకు తీసుకు వచ్చి, కొంత డబ్బిచ్చి, "ఊళ్ళోకి వెళ్ళి రొట్టె పట్టుకురా," అన్నాడు.

పనివాడు తిరిగి నేల మీదికి రాగానే అక్కడ పనిచేస్తున్న నలుగురు ఆడకూలీలు అతన్ని చూడగానే బెదిరి, చేసే పని మానేసి పారిపోయారు. పనివాడు వాళ్ళను తిట్టుకుంటూ ఊళ్ళోకి వెళ్ళాడు. కాని ఊరు గుర్తుపట్టేటట్టు లేదు. అఖరుకు తానూ, తన తల్లిదండ్రులూ ఉండే ఇల్లు గాని, కనీసం ఆ ఇల్లు ఉండే వీధి గాని పోల్చటం వాడికి సాధ్యం కాలేదు. వాడు ఒక అంగడికి పోయి, తన వద్ద ఉన్న డబ్బు ఇచ్చి రొట్టె ఇయ్యమంటే, అంగడివాడు ఆ డబ్బులు చెల్లవన్నాడు. ఆ దుకాణం వద్ద

ఉన్న చదువుకున్న పెద్దమనిషి ఆ డబ్బులు పరీక్షించి, నూరేళ్ళ నాటివని చెప్పాడు.

తాను ఒక నూరేళ్ళు నిద్రపోయి ఉండాలని పనివాడికి అర్థమయింది! వాడు గనిలోకి తిరిగి వెళ్ళి షరాబుతో, "నేను నూరేళ్ళు నిద్ర పోయినట్టున్నాను. ఇప్పుడు నా గతి ఏం కాను?" అన్నాడు.

"అదంతా ఏమీ లేదు. నువు ఊళ్ళోకి తిరిగి వెళ్ళు. నువు మహా నిద్రపోతే రెండేళ్ళకు పైన నిద్రపోయి ఉండవు. జ్ఞాపకం ఉంచుకుని, సరిగా ఏడాదికి మళ్ళీ వచ్చి కనబడు. నే నిక్కడే ఉంటాను," అన్నాడు షరాబు, పనివాడికి కొంత బంగారం ఇస్తూ.

పనివాడు ఈసారి తిన్నగా ఇంటికి వెళ్ళగలిగాడు. కాని వాడు తన అనుభవాలు చెబితే, వాడి భార్య గాని, పిల్లలు గాని, స్నేహితులు గాని నమ్మలేదు.

సంవత్సరం గడిచాక పనివాడు మళ్ళీ గనిలోకి దిగి, షరాబును కలుసుకున్నాడు.

"ఈ సారి నీకు ఏకంగా నిధినిక్షేపం చూపిస్తాను. నా వెంట రా!" అంటూ దారి లేని దారి వెంట, పాడుబడిన సొరంగాల కుండా చాలా దూరం తీసుకుపోయాడు. చివరకు వాళ్ళు చేరిన చోట అంతులేని నిధు లున్నాయి.

"ఇదంతా ఒకప్పుడు భూమికి దగ్గిరగా ఉండేది. పనివాళ్ళు సులువుగా తవ్వి తీసుకునేవాళ్ళు. కాని తేరగా వచ్చిన డబ్బుతో మనుషులు మదించిపోయారు. అందుకు శిక్షగా ఈ నిధి అంతా భూగర్భంలోకి దిగి వచ్చేసింది. నువు పట్టుకు పోగలిగినంత పట్టుకుపోయి సుఖంగా ఉండు." అన్నాడు షరాబు.

"ఈ నిధిని గురించి నేను నలుగురికీ చెప్పవచ్చునా?" అని పనివాడు అడిగాడు.

"చెబితే చెప్పు, పలుగులూ, పారలు తెచ్చి తవ్వుకుపొమని కూడా చెప్పు." అన్నాడు షరాబు.

కాని పనివాడికి పట్టిన ఐశ్వర్యం చూసి వాళ్ళు కూడా వాడు చెప్పిన కథ నమ్మలేదు. ఆ నిధిని కనుక్కున్నవారు ఆ తరవాత ఎవరూ లేరు.



# చింత పిచ్చి

సిద్దయ్య బావి దగ్గిర స్నానం చేస్తూ సమీపంలో చిన్న చింత మొలకను చూశాడు; పెళ్ళాన్ని పిలిచి, "ఒసే కొండమ్మా! ఇక్కడ చింతపిక్క మొలకెత్తింది. ఇది పెద్దదై కాయలు కాస్తే ఏం చేద్దాం?" అని అడిగాడు.

"చింతకాయలు అమ్మి గేదెను కొందాం!" అన్నది కొండమ్మ.

"అయితే కుమ్మరి ఇంటికి వెళ్ళి, పాల కొక కుండా, నెయ్యి కొక కుండా, వెన్న కొక కుండా, పాలు పితకటాని కొక ముంతా తీసుకురా!" అన్నాడు సిద్దయ్య.

కొండమ్మ కుమ్మరి ఇంటి నుంచి నాలుగు కుండలూ, ఒక ముంతా తెచ్చింది.

"ఒక కుండ ఎక్కువ తెచ్చావు దేనికే?" అని మొగుడు అడిగాడు.

"మా అమ్మకు నెయ్యి అంటే చాలా ఇష్టం. ఆవిడకు నెయ్యి పంపించటానికి ఇంకో కుండ కొన్నా," అన్నది కొండమ్మ.

"మనకే నెయ్యి చాలకుండా ఉంటే, పుట్టింటికి కూడా పంపిస్తావా?" అని సిద్దయ్య పెళ్ళాన్ని కొట్టసాగాడు.

నలుగురూ పోగయారు. అందులో ఒక పెద్దమనిషి సిద్దయ్యను, "ఎందుకలా పెళ్ళాన్ని కొట్టి చంపుతున్నావు?" అన్నాడు. సిద్దయ్య చెప్పాడు. వెంటనే ఆ పెద్దమనిషి సిద్దయ్యను కర్రతో కొట్టటం మొదలుపెట్టాడు.

"నన్నెందుకు కొడతావు?" అన్నాడు సిద్దయ్య.

"నీ గేదె నా చేలో పడి మేస్తుంటే ఏం చెయ్యమంటావు?" అన్నాడా పెద్దమనిషి. అందరూ గొల్లున నవ్వారు. సిద్దయ్యకు అవమానమయింది.

—యస్. చాంద్‌బాషా, శాంతి





# కొంగ ఖలీఫా

బొగ్దాదును పాలించే ఖలీఫా ఒకనాటి అపరాహ్ణం విశ్రాంతి తీసుకుంటూ తన పెద్ద వజీరుతో కబుర్లు చెబుతూండగా ఒక వీధి బేరగాడు వింతవింత సరుకులతో వచ్చాడని కబురు వచ్చింది. వాడి వద్ద మంచి వస్తువు ఏదైనా ఉంటే కొని తన వజీరుకు బహుమతిగా ఇద్దామని, ఖలీఫా ఆ వీధిబేరగాణ్ణి తా నున్న చోటికి పిలిపించాడు.

బేరగాడి పెట్టె తెరిపించి, అందులో ఉన్న వింత హారాలూ, ఉంగరాలూ, పాత్రలూ, దువ్వెనలూ చూసి, రాళ్ళు పొదిగిన దువ్వెన ఒకటి కొని, తన వజీరు భార్య కోసం బహుమతిగా ఇచ్చాడు. ఆ సమయంలో ఖలీఫాకు బేరగాడి పెట్టెలో ఒక పక్కగా ఒక సొరుగు కనిపించింది. అందులో ఏమున్నదని ఆయన బేరగాణ్ణి అడిగాడు. బేరగాడు సొరుగు తెరిచి, అందులో నుంచి ఒక డబ్బీ, ఒక కాగితమూ తీశాడు.

"హుజూర్, ఇవి ఏమిటో నాకు తెలీదు, ఎవరో వర్తకుడు, తనకు మక్కా వీధుల్లో దొరికాయని వీటిని నాకు ఇతర వస్తువులతో బాటు ఇచ్చాడు. వీటిని ఎవరూ కొనరు. కావాలంటే తమరు తీసుకుని తమకు తోచి నది ఎంత ఇచ్చినా సరే, సంతోషంగా పుచ్చుకుంటాను," అన్నాడు బేరగాడు.

డబ్బీలో నల్లని పొడి వున్నది. కాగితం మీద ఏదో వింత భాష రాసి ఉన్నది. ఆ భాష ఖలీఫాకు గాని, వజీరుకు గాని తెలియ లేదు. బేరగాడికి డబ్బిచ్చి పంపేసి, ఖలీఫా తన వజీరుతో, "దీన్ని చదవగలవాడు ఎవ డన్నా కావాలి," అన్నాడు.

"పెద్ద మసీదులో ఉండే సలీం పండితుడికి ప్రపంచంలో ఉన్న భాషలన్నీ వచ్చునంటారు. అతణ్ణి యిక్కడికి పిలిపిద్దాం. ఈ కాగితాన్ని అతను చదవగలడేమో!" అన్నాడు వజీరు.

అరేబియా జానపదకథ



సలీముకు కబురు వెళ్ళింది. ఆయన వచ్చి కాగితాన్ని పై నుంచి కిందికి చూసి, "ఇది హూణభాష," అన్నాడు.

"అయితే, ఆ హూణభాషలో రాసి ఉన్న దేమిటో స్పష్టంగా చెప్పు," అన్నాడు ఖలీఫా. సలీము కాగితంలో రాసి ఉన్నది ఇలా చెప్పాడు:

"ఈ నల్లపొడిని చిటికెడు పీల్చి, 'ముత బోర్' అన్నట్టయితే ఎవరైనా తాము కోరుకున్న ప్రాణిగా మారిపోవచ్చు. అప్పుడు వారికి అన్ని ప్రాణుల భాషలూ అర్థమవుతాయి. అలా మారినవాళ్ళు తిరిగి మనిషి రూపం పొందాలంటే, తూర్పుగా తిరిగి మూడుసార్లు శిరస్సు వంచి, మళ్ళీ అదే మాట ఉచ్చరించాలి. ఒక్క హెచ్చరిక: ఏ పక్షి రూపంలో గాని, జంతు రూపంలో గాని ఉండే సమయంలో నవ్వరాదు; నవ్వితే మాట గుర్తు రాకుండా పోయి, ఆ పక్షి రూపంలోనే, లేక జంతు రూపంలోనే అజన్మాంతరం ఉండిపోవలసి ఉంటుంది."

సలీము ఇలా చెప్పగా విని ఖలీఫా చాలా సంతోషించాడు. ఆయన ఈ రహస్యాన్ని ఎవరికీ చెప్పనని సలీము చేత ప్రమాణం చేయించుకుని, అతనికి మంచి దుస్తు లిచ్చి పంపేశాడు.

తరవాత ఆయన తన వజీరుతో, "మంచి బేరమే చేశాం. నాకు ఏదైనా జంతువు కావాలని చాలా ఆత్రంగా ఉన్నది. రేపు పెందలాడే వచ్చావంటే మనం ఎటైనా షికారుగా వెళ్ళి, ఎన్నడూ వినని వన్నీ విందాం," అన్నాడు.

మర్నాడు ఉదయం ఖలీఫా, వజీరూ కలిసి బయలుదేరారు. వాళ్ళ వెంట నౌకర్లను రానివ్వలేదు. ఇద్దరూ రాజోద్యానం కుండా నడిచి, నగరం వెలపల ఉన్న కోనేరుగట్టు చేరుకున్నారు. అక్కడ రకరకాల జంతువు లుండేవి. వాటిని చూస్తూంటే ఏ జంతువుగా మారాలనిపిస్తుందో ఆ రూపంలోకి మారదామని వాళ్ళు అనుకున్నారు.

వారు కోనేరు వద్దకు చేరుకునే సరికి అక్కడ ఒక పెద్ద కొంగ కోనేటి ఒడ్డున

తీవిగా పచార్లు చేస్తూ, మధ్య మధ్య కప్పలను పట్టుకుని మింగుతున్నది. అంతలో మరో కొంగ కోనేటి వద్దకు ఎగిరి వస్తూ వాళ్ళకు కనబడింది.

"హుజూర్, ఇప్పు డీ రెండు కొంగలూ కలుసుకుని తప్పక మాట్లాడుకుంటాయి. మనం కూడా కొంగలుగా మారి, అవి మాట్లాడుకునేది విందామా ఏం?" అన్నాడు వజీరు ఖలీఫాతో.

ఖలీఫా తన బొడ్డు నుంచి పొడి ఉన్న డబ్బీ తీశాడు. ఆయనా, వజీరూ చెరొక చిటికెడు పొడుమూ తీసుకుని పీల్చి, "ముతబోర్!" అన్నారు. వెంటనే ఇద్దరికీ కొంగల రూపాలు వచ్చేశాయి.




ఇంతలో ఎగిరి వచ్చిన కొంగ కప్పలను తినే కొంగను చేరుకున్నది. రెండు కొంగలూ పలకరించుకున్నాయి. తరవాత కప్పలను తినే కొంగ రెండవదానితో, "నీ ఫలహారం అయిందా? రెండు కప్పలను నీ కోసం పట్టేదా?" అన్నది.

దానికి రెండోది, "వద్దు. నా కిప్పుడు ఆకలి లేదు. ఇవాళ నన్ను అతిథుల ముందు నృత్యం చెయ్యమన్నారు. అభ్యాసం చెయ్యటానికి వచ్చాను," అని అటూ ఇటూ అడుగులు వేస్తూ తిరగ సాగింది. అలా తిరిగి తిరిగి, అది ఒంటికాలి మీద నిలబడేసరికి, ఖలీఫాకూ, వజీరుకూ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వు వచ్చేసింది. ఆ నవ్వుకు మొదటి కొంగలు రెండూ లేచి పోయాయి. "ఇంతకన్న గొప్ప హాస్యం నా జన్మలో ఎరగను," అన్నాడు వజీరు.

"మనం నవ్వకపోతే అవి పాటలు కూడా పాడి ఉండేవి," అన్నాడు ఖలీఫా.

అంతలోనే వాళ్ళ హాస్యం ఇగిరి చక్కా పోయింది. మరో రూపంలో ఉండగా నవ్వరాదు. వాళ్ళిద్దరూ కొంగల రూపంలో ఉండి నవ్వేశారు.

"మనం మనుషులుగా మళ్ళీ కావాలంటే అనవలిసిన మాట ఏమిటి? నేను మరిచి పోయినానే! నీకు గుర్తున్నదా?" అని ఖలీఫా వజీరు నడిగాడు.




"మనం తూర్పుగా తిరిగి, మూడుసార్లు తల వంచి, ము....ము....ము—" అంటూ వజీరు కూడా ఆగిపోయాడు. ఆ మాట ఆయనకూ జ్ఞాపకం రాలేదు.

ఇద్దరికీ మతిపోయింది. ఏంచెయ్యాలో తోచ లేదు. ఆ మాట జ్ఞాపకం రాకపోతే వాళ్ళిద్దరూ పెద్ద కొంగలుగా యావజ్జీవం ఉండిపోవడం తప్పదు. వాళ్ళు రాచనగరుకు తిరిగి పోయి ప్రయోజనం ఉండదు. ఒక కొంగ ఖలీఫా గానూ, మరో కొంగ పెద్ద వజీరుగానూ పనిచేస్తామంటే బాగ్దాదు పౌరులు ఎన్నటికీ సహించరు. చాలా రోజులపాటు వాళ్ళు అక్కడా ఇక్కడా తచ్చాడారు. ఆకలికి కప్ప లను మింగటమూ, తొండలను మింగటమూ వాళ్ళకు మనస్కరించక, పళ్ళు తిని బతక టానికి యత్నించారు. అయితే అంతంత పొడుగు ముక్కులు వేసుకుని పళ్ళు తినటం కూడా ఎంతో కష్టమయింది. ఈ దుస్థితిలో వాళ్ళ కున్న ఒక్క ఆనందమూ ఎగరటం మాత్రమే. అందుచేత వాళ్ళు బాగ్దాదు నగరం మీద ఎగురుతూ, వీధులు కల్లోలంగా ఉండటం గమనించారు. కారణం ఏమిటో తెలుసుకుందామని రాజ భవనం కప్పు మీద కూర్చుని, రాజవీధిలో జరిగేది గమనించసాగారు.

వీధిలో బాజాల మోతతో ఒక ఊరేగింపు వచ్చింది. జలతారు కుట్టిన ఎర్ర దుస్తులు ధరించిన వాడొకడు అలంకరించిన గుర్రం మీద కూర్చుని, చుట్టూ బానిసలను పెట్టు కుని ఊరేగుతూ వీధి వెంట వచ్చాడు. బాగ్దాదు పౌరులలో సగంమంది వాడి వెన కాల ఉన్నారు; "బాగ్దాదు ప్రభువు మీర్జాకు జై!" అని కేకలు పెడుతున్నారు.

"నన్నిలా మాయలో ఎందు కిరికించారో ఇప్పుడైనా తెలిసిందా, వజీర్! ఈ మీర్జాగాడి తండ్రి ఒక మాంత్రికుడు; నాకు బద్ధ శత్రువు! నా మీద చాలా కాలంగా కత్తికట్టి ఉన్నాడు. ఇల్లలకగానే పండగ అయిందా? మనం ప్రవక్త సమాధి దర్శనం చేసుకుని, మరిచిపోయిన మాట జ్ఞాపకం వస్తుందేమో చూదాం." అన్నాడు ఖలీఫా.

ఇద్దరూ రాజభవనం కప్పు మీది నుంచి లేచి, మదీనా కేసి ఎగురుతూ బయలు దేరారు. కాని, రెండుగంటలు ఎగిరేసరికల్లా వాళ్ళకు, అలవాటు లేక, అయాసం వచ్చే సింది. ముసలివాడైన వజీరు, "ఇక ఎగ రటం నా వల్ల కాదు. అదీ గాక సాయం కాలం అవుతున్నది. ఈ రాత్రి ఎక్కడన్నా గడుపుదాం," అన్నాడు.



దిగువన లోయలో ఒక శిథిలగృహం కని పించింది. అందులో రాత్రి గడుపుదామను కుని, ఇద్దరూ అక్కడ వాలారు. వాళ్ళు చూసినది ఒక పాడుబడిన కోట. అది పూర్తిగా శిథిలం కాలేదు. కొన్ని గదులు ఇంకా చెక్కుచెదరకుండా నిలిచి ఉన్నాయి. ఇద్దరూ గదుల మధ్య నడవల వెంబడి నడవసాగారు.

వజీరు చప్పున ఆగి, "హుజూర్, ఇక్కడ దయ్యా లున్నట్టున్నాయి. కొంగ రూపంలో ఉన్నా కూడా నన్ను దయ్యాల భయం వదల కుండా ఉన్నది," అన్నాడు.

ఖలీఫా కూడా ఆగి ఆలకించాడు. ఎక్కడి నుంచో మూలుగు లాంటి రోదనం వినిపిస్తు న్నది. ఖలీఫా సాహసంతో ఆ ధ్వని వస్తున్న వేపు బయలుదేరాడు. ఒక చీకటి నడవ కుండా వెళ్ళగా ఒక చీకటి గదిలో ఒక గుడ్లగూబ కూర్చుని, మూలుగుతూ కన్నీరు కార్చుతున్నది.

ఆ గుడ్లగూబ, తన గది వాకిలి దగ్గర రెండు కొంగలు కనిపించగానే, ఆనందంతో చిన్న కేక పెట్టి, "రండి, కొంగలూ! దయ చెయ్యండి. నాకు విమోచనం కలిగిం చండి," అన్నది.

ఖలీఫా ఆ గుడ్లగూబతో, "ఓ గుడ్లగూబా, నీ మాటలను బట్టి నువు కూడా మే మున్న దుస్థితిలోనే ఉన్నట్టున్నావు. కాని మా మీద ఆశలు పెట్టుకోకు. మా దుస్థితి గురించి వింటే మేము ఎంత అసహాయులమో నీకే తెలుస్తుంది," అని తమ ఇద్దరి కథా గుడ్ల గూబకు తెలిపాడు.

అంతా విని గుడ్లగూబ, "ఇక నా కథ వినండి," అంటూ ఇలా చెప్పింది :



" మా తండ్రి ఒక తూర్పుదీవికి రాజు. మీ కీ గతి కలిగించిన మాంత్రికుడే నన్నూ ఇలాటి గతికి తెచ్చాడు. ఒక రోజు వాడు మా నాన్న వద్దకు వచ్చి, నన్ను తన కొడుకైన మీర్జా కిచ్చి పెళ్ళి చెయ్యమన్నాడు. మా నాన్న కాస్త తొందరపడి వాణ్ణి నౌకర్ల చేత బయటికి గెంటించాడు. తరవాత వాడు తన ఆకారం మార్చుకుని, మా ఇంట సేవకుడుగా చేరి, ఒకనాడు నాకు ఏదో తాగటానికి ఇచ్చాడు. అది తాగగానే నా కీ భయంకర రూపం వచ్చేసింది. వాడు నన్ను తెచ్చి ఇక్కడ ఉంచి, 'నిన్ను ఈ రూపంలో ఎవరన్నా పెళ్ళాడే దాకా ఇక్కడే, ఇలాగే ఉండు. నీకూ, నీ తండ్రికీ అంత పొగరా?'

అని వెళ్ళిపోయాడు. అది మొదలు ఎన్నో మాసాలుగా ఇక్కడే ఉండి కుములుతున్నాను. బయటికి పోవడానికి లేదు. వెలుగు చూడలేను. రాత్రిపూట బయటికి వెళితే మాత్రం ప్రకృతి సౌందర్యం చూసి ఆనందించటానికి ఏముంటుంది?"

ఇలా చెప్పి గుడ్లగూబ కంటికీ మంటికీ ఏకధారగా ఏడవసాగింది.

"మనం ఒకే రకం చిక్కుల్లో ఉన్నాం. దీని నుంచి ఎలా బయటపడాలో తెలియకుండా ఉన్నది," అన్నాడు ఖలీఫా.

"మనం ఈ చిక్కు నుంచి బయట పడగల మనుకుంటాను. నేను చిన్న పిల్లగా ఉండగా ఒక ఎరుకలది, నాకు కొంగ పల్ల చాలా మేలు కలుగుతుందని చెప్పింది. ఈ రూపాలు పోయి మనం తిరిగి మనుషులం కావటానికి ఒక ఉపాయం తోస్తున్నది," అన్నది గుడ్లగూబ.

"ఏమిటది?" అని ఖలీఫా, వజీరూ ఒకేసారి ఆత్రంగా అడిగారు.

"మంత్రగాడు నెల కొకసారి ఇక్కడికి సపరివారంగా వచ్చి, విందు చేస్తూంటాడు. అప్పుడు ప్రతి ఒకరూ తాము చేసిన దుర్మార్గాలు ఇతరులకు చెప్పుకుంటారు. మీరు మరిచిపోయిన మంత్రశబ్దం వాళ్ళ నోట వస్తే రావచ్చు," అన్నది గుడ్లగూబ.

"వాళ్ళు ఏ రోజు వస్తారు? ఏ గదిలో విందు చేస్తారు?" అని ఖలీఫా అడిగాడు.

"మీ మోక్షమే మీరు చూసుకుంటు న్నారు. నా విమోచనం సంగతి నేను చూసుకోవద్దా? అందుచేత మీ ఇద్దరిలో ఎవరో ఒకరు నన్ను పెళ్ళాడటానికి ఒప్పు కుంటే తప్ప నేను మీకు వివరాలేవీ చెప్పను. నన్ను క్షమించాలి!" అన్నది గుడ్లగూబ.

ఈ మాట విని చకితులై, వజీరూ, ఖలీఫా ఒకరినొకరు చూసుకున్నారు. వారు తమలో తాము సంప్రదించుకోగోరి గది దాటి ఇవ తలికి వచ్చారు.

"వజీరూ, పెద్ద చిక్కు వచ్చిపడింది. ఆమెను నువు పెళ్ళాడెయ్యి." అన్నాడు ఖలీఫా.

"ఇంకా నయం! ఈ మాట తెలిస్తే నా భార్య నా కళ్ళు పీకేస్తుంది. అదీ గాక నేను ముసలివాణ్ణి. ఏలినవారంటే యువకులు, ఇంకా తమకు పెళ్ళి కాలేదు కూడానాయె!" అన్నాడు వజీరు.

"అదే వచ్చిన చిక్కు. ఈ రాజకుమార్తె ఏ వయసుదో, ఏపాటి అందం గలదో తెలియ కుండా ఎలా నిఖా చేసుకోవటం?" అన్నాడు ఖలీఫా.

ఇద్దరూ చాలాసేపు ఘర్షణ పడ్డారు. వజీరు మొండికెత్తి, చచ్చిన దాకా కొంగగా



నైనా ఉంటానుగాని, ఆ గుడ్లగూబను పెళ్ళా డనన్నాడు. ఇక ఖలీఫాకు తప్పలేదు.

ఖలీఫా తనను పెళ్ళాడతానననగానే గుడ్లగూబ మహా ఆనందపడి, "మీరు సమ యానికే వచ్చారు. ఇవాళే మాంత్రికుడు విందు చేసే రోజు, వాళ్లు విందు చేసే చోటు చూపిస్తాను రండి," అంటూ వాళ్లను అనేక నడవల వెంబడి తీసుకుపోయింది. ఒక పడిపోయిన గోడకుండా అవతల ఉన్న పెద్ద హాలు కనిపిస్తున్నది. ఆ హాలులో రంగురంగుల దీపాలు వెలుగుతున్నాయి. ఒక బల్ల మీద వండిన పదార్థాలున్నాయి. ఆ బల్ల చుట్టూ ఎనిమిదిమంది మనుషులు కూర్చుని ఉన్నారు. వారిలో, పాడి డబ్బీ

ఇచ్చిన బేరగాణ్ణి ఖలీఫా, వజీరూ గుర్తించారు. ఆ బేరగాడు తాను చేసిన ఘన కార్యాలు చెబుతున్నాడు.

"వాళ్ళు తిరిగి మనుషులు కావడానికి ఏం మాట చెప్పావు?" అని బేరగాణ్ణి ఎవరో అడిగారు.

"ముతబోర్ అనే మాయాశబ్దం చెప్పాను. అది నోరు తిరగదు," అన్నాడు బేరగాడు.

తాము మరిచిపోయిన మాట చెవిని పడగానే ఖలీఫాకూ, వజీరుకూ ఎంతో ఆనందావేశం కలిగింది. ఇద్దరూ ఒక్కసారిగా తూర్పుకేసి తిరిగి, మూడు సార్లు తలలు వంచి, "ముతబోర్!" అని మానవ రూపాలు తెచ్చుకున్నారు. ఆ ఆనందంలో ఇద్దరూ కౌగలించుకుని ఆనంద బాష్పాలు రాల్చారు.

చివరకు వాళ్ళు వెనక్కు తిరిగి చూసేసరికి అక్కడ ఒక అద్భుత లావణ్యవతి నిలబడి ఉన్నది. ఆమె నవ్వుతూ ఖలీఫాను, "గుడ్లగూబను మీరు గుర్తించలేదా?" అని అడిగింది.

ఆమెను చూడగానే ఖలీఫాకు, తన అదృష్టం వల్లనే తాను కొంగగా మారటం జరిగిందనిపించింది. ముగ్గురూ కలిసి శిథిలగృహం వదిలి బాగ్దాదు నగరానికి బయలుదేరారు.

ఖలీఫా తిరిగి రావటంతో నగరంలో పెద్ద సంచలనం కలిగింది. ఆయన చనిపోయాడనే ప్రజలు అనుకున్నారు. ఇప్పుడు వారి ఆనందానికి మేరలేదు. అదే విధంగా వారికి మీర్జా మీద పట్టరాని ఆగ్రహం కూడా వచ్చింది. వాళ్ళు రాజభవనంలో మాంత్రికుణ్ణీ, మీర్జానూ పట్టుకున్నారు. రాజకుమార్తె గుడ్లగూబగా జీవించిన గదిలోనే మాంత్రికుణ్ణి ఖలీఫా ఉరి తీయించాడు. కాని ఆయన మీర్జాను శిక్షించలేదు; వాడికి తండ్రి చర్యలు తెలియవు. ఖలీఫా వాడిచేత చిటికెడు నల్లపొడుం పీల్పించి, కొంగనుగా మార్చి వదిలేశాడు.

తరవాత ఖలీఫాకూ, రాజకుమార్తెకూ వైభవంగా వివాహం జరిగింది. వాళ్ళు చాలాకాలం సుఖంగా జీవించారు.





# వరపరీక్ష

పూర్వం స్కంధపురిని నాగేంద్రుడనే రాజు పరిపాలించేవాడు. నాగేంద్రుడికి కుంద నందిని అని గొప్ప రూపలావణ్యములు కలిగిన కుమార్తె వుంది. మిసమిసలాడే యవ్వనంలో మణి వలె ప్రకాశిస్తున్న కుంద నందినిని గూర్చిన కథలు దేశదేశాల్లో రక రకాలుగా చెప్పుకునేవారు.

కుమార్తె సౌందర్యం నాగేంద్రుడికి గర్వ కారణం కాకపోగా ఆపదలకు మూలకారణ మైంది. కుందనందినిని తమ కిచ్చి వివాహం గావించవలసిందిగా అనేక దేశాల మహారాజులు వర్తమానా లంపారు. పొరుగు దేశాలైన కనకగిరి, ఉదయగిరి దేశాల మహా రాజులు అలా సందేశాలు పంపడమే కాకుండా, తమ కోరిక చెల్లించని పక్షంలో తీవ్ర పరిణామాలకు గురికావలసి వస్తుం దని కూడా హెచ్చరించారు. నాగేంద్రుడు ఇరకాటంలో పడిపోయాడు. కుందనందినిని ఎవరి కిచ్చి వివాహం గావించేట్లు? ఏ ఒక్క రికో ఇచ్చి వివాహం చేసేస్తే, మిగిలినవారు తనపై కక్షకట్టక మానరు గదా? అసలే స్కంధపురి చిన్న రాజ్యం. తన మనుగడకే ముప్పు వాటిల్లేటట్లుంది పరిస్థితి.

ఏమీ తోచక కుమార్తెనే సలహా అడి గాడు నాగేంద్రుడు. తను పెట్టిన పరీక్షలో గెల్చినవాణ్ణి వివాహమాడుతా నంది కుంద నందిని. అదే అనుకూలంగా తోచింది నాగేం ద్రుడికి కూడా. అందువల్ల తనపై కక్షకట్ట టానికి ఏ దేశపు రాజుకూ ఎలాంటి ఆస్కారం వుండదు.

తన కుమార్తె పెట్టబోయే పరీక్షకు హాజరు కావలసిందిగా అన్ని దేశాల రాజు లకూ; రాకుమారులకూ వర్తమానా లంపాడు నాగేంద్రుడు.

గడువు నాటికి అనేక దేశాల రాజులూ, రాకుమారులూ స్కంధపురి చేరుకున్నారు.

యస్. జహర



పరీక్షకు నిర్ణయించిన పెద్ద మంటపంలో మూడు చిన్న చిన్న పెట్టెలు అమర్చబడ్డాయి. ఒకదాంట్లో అన్నీ బంగారునాణ్యా లున్నాయి. మరొకదాంట్లో అన్నీ వెండి నాణ్యా లున్నాయి. మూడవ పెట్టెలో బంగారు, వెండి నాణ్యాలు కలిసి వున్నాయి. అన్ని పెట్టెలకూ మూత లున్నాయి. ఒక మూత పైన "బంగారం-బంగారం" అని వ్రాసి వుంది. రెండవ పెట్టె పైన "వెండి-వెండి" అని వ్రాసి వుంది. మూడవ పెట్టె పైన "బంగారం-వెండి" అని వ్రాసి వుంది. మూతలు మార్చి, పెట్టెలో ఏ నాణ్యాలైతే వున్నాయో దానికి తగిన మూత దానిపై లేకుండా చేశారు. అంటే, బంగారు నాణ్యా లున్న పెట్టె పైన "బంగారం-బంగారం" అన్న మూత లేదు. వెండి నాణ్యా లున్న పెట్టె పైన "వెండి-వెండి" అన్న మూత లేదు. బంగారు, వెండి నాణ్యాల మిశ్రమ మున్న పెట్టె పైన "బంగారం-వెండి" అన్న మూత లేదు. ఈ విషయం మంటపంలో అందరి మధ్య వెల్లడించబడింది. షరతు ఏమిటంటే, ఏ పెట్టెలోనైనా చేయి పెట్టి, అందులోకి తొంగిచూడకుండా ఒక్క నాణ్యాన్ని మాత్రం బయటికి తీయాలి. ఆ ఒక్క నాణ్యాన్ని చూచి ఏ ఏ పెట్టెల్లో ఏ ఏ నాణ్యా లున్నాయో చెప్పగలగాలి. చెప్పగలగటమే కాదు. సకారణంగా నిరూపించాలి కూడా.

ఈ షరతు ఏమిటో, ఒక్క నాణ్యాన్ని మాత్రం చూచి ఏ పెట్టెలో ఏ నాణ్యా లున్నాయో చెప్పగలగట మెలాగో ఏ రాజుకూ, ఏ రాజకుమారుడికీ అర్థం కానే లేదు. గ్రుడ్డిగా చెప్పాలన్నా సకారణంగా నిరూపించాల్సి వుందాయె! అందరూ చిరాకుపడి పోయారు. ఎంత ఆలోచించినా ఏ బుర్రకూ ఉపాయం తట్టలేదు.

పృథులదేశపు మంత్రికుమారుడు బాలచంద్రుడు గొప్ప యోధుడు మాత్రమే కాదు, మహా మేధావిగూడా. అన్ని కళలూ, శాస్త్రాలూ అభ్యసించినవాడు. అతని బుర్రకు ఏదో ఆలోచన తట్టినట్లుంది. మంటపం మధ్యకు

అడుగు పెట్టాడు. మూడు పెట్టెలనూ పరిశీలించి చూచాడు. 'బంగారం-వెండి' అని వ్రాసివున్న మూత తీసి ఒక్క నాణ్యాన్ని మాత్రం బయటకు తీశాడు. అది వెండి నాణ్యం. ఇందులో అన్నీ వెండి నాణ్యాలున్నాయి అన్నాడు. 'బంగారం-బంగారం' అని వ్రాసిన మూతవున్న పెట్టెలో, బంగారు వెండి నాణ్యాల మిశ్రమం వుంది అన్నాడు. మూడవ పెట్టెలో అన్నీ బంగారు నాణ్యాలున్నాయి అని ప్రకటించాడు. ఆశ్చర్యంతో పెట్టెలు తెరిచి చూచారు సభికులు. అన్నీ సరిగ్గానే వున్నాయి అతడు చెప్పినట్లు. నీ నిర్ణయానికి కారణాలేమిటో చెప్పమన్నారు అంతా.

బాలచంద్రుడు ఇలా చెప్పాడు: 'బంగారం-వెండి' అని వ్రాసివున్న మూతను తీసి ఒక నాణ్యాన్ని బయటకు తీశాను. అది వెండి నాణ్యం. ముందు చెప్పినదాన్ని బట్టి అందులో బంగారు వెండి నాణ్యాల మిశ్రమం వుండటానికి వీలులేదు. ఎందుకంటే, బంగారు-వెండి నాణ్యాల మిశ్రమమున్న పెట్టె పైన 'బంగారు-వెండి' అని వ్రాసిన మూత వుండకూడదు. కాబట్టి అందులో పూర్తిగా బంగారు నాణ్యాలుగాని, వెండి నాణ్యాలుగాని వుండి వుండాలి. నా చేతికి వెండి నాణ్యం వచ్చింది కాబట్టి అందులో వున్నవన్నీ వెండి నాణ్యాలే. 'బంగారం-బంగారం' అని వ్రాసిన మూత వున్న పెట్టెలో పూర్తిగా బంగారు నాణ్యాలుండడానికి వీలులేదు. వెండి నాణ్యాలు కావని మనకు తెలుసాయె! అందువల్ల అందులో బంగారు-వెండి నాణ్యాల మిశ్రమం వుండితీరాలి. పోతే యిక మిగిలిన మూడవ పెట్టెలో పూర్తి బంగారు నాణ్యాలున్నాయి."

అందరూ ఆనందంతో చప్పట్లు చరిచారు. బాలచంద్రుడి తెలివికి అందరూ సంతోషించి అతన్ని పొగిడారు. కుందనందిని అందరూ చూస్తుండగా బాలచంద్రుడి మెడలో పూల హారం అలంకరించింది. ఆపద నుండి బయటపడ్డ నాగేంద్రుడు ఆనందంతో వధూవరులను ఆశీర్వదించాడు.



# సరికి సరి

రామయ్య, సోమయ్యల పొలాలకు గట్టే అడ్డం. ఒక ఏడు ఇద్దరూ పంటలు కోసి, కుప్పలు నూర్చి, కళ్ళాలలో ధాన్యపు రాసులు పోసుకున్నారు. రామయ్య తన ఇంటికి భోజనానికి పోతూ, "సోమయ్యా, నేను తిరిగివచ్చిన దాకా నా రాశి చూస్తూ ఉండు," అన్నాడు.

రామయ్య వెళ్ళగానే సోమయ్యకు దురాశ పుట్టింది; రామయ్య రాశి నుంచి పది తట్టల ధాన్యం తీసి తన రాసిలో పోసేసుకున్నాడు.

రామయ్య తిరిగి వచ్చి, "సోమయ్యా, నా రాశి తరిగినట్టు కనబడుతుందేం?" అన్నాడు.

"పిట్ట గుంపులు వచ్చి తిని పోయాయి," అన్నాడు సోమయ్య.

"పిట్టల్ని తోలకపోయావా?" అన్నాడు రామయ్య.

"నువ్వు రాశిని చూస్తూండమన్నావు గాని, పిట్టల్ని తోలమని చెప్పలేదుగా?" అన్నాడు సోమయ్య.

తరవాత సోమయ్య భోజనానికి పోతూ, "రామయ్యా, నా రాశి మీద పిట్టలు గాని వాలితే తోలు," అని ఇంటికి వెళ్ళిపోయాడు.

రామయ్య అతని రాశిలో నుంచి ఇరవై తట్టల ధాన్యం తీసి తన రాశిలో పోసుకున్నాడు.

"నా రాశి తరిగినట్టు కనబడుతుందే, రామయ్యా?" అన్నాడు సోమయ్య తిరిగి వచ్చి.

"సుడిగాలి వచ్చి ఎగరగొట్టుకు పోయింది. ఏం చెయ్యను?" అన్నాడు రామయ్య.

—పి. కుసుమకుమారి





# పంచకల్యాణి

ఒక రాజు వద్ద వీరదాసు అనేవాడు కొలువు ఉండేవాడు. అతను తన రాజును భక్తి విశ్వాసాలతో సేవించి బాగుపడ్డాడు. రాజు అతనిపట్ల చాలా అభిమానంగా కూడా ఉండే వాడు. దురదృష్టవశాన ఒకసారి వీరదాసు కొడుకులు ముగ్గురికీ, రాజు కొడుకులతో కొట్లాట సంభవించింది. ఆ కొట్లాటలో రాజు కొడుకు ఒకడు చనిపోవటం కూడా తటస్థించింది.

ఈ సంగతి తెలియగానే రాజు వీర దానును పిలిపించి, కఠినంగా మందలించి, "నీ కొడుకులు నా కొడుకులతో జగడానికి ఏమని దిగారు? నా కొడుకు చనిపోయి నందుకు నీ కొడుకులను ఈ క్షణం ఉరి తీయించగలను. కాని అందువల్ల పోయిన నా కొడుకు తిరిగి రాడు. అయినా వాళ్ళకు శిక్ష తప్పదు. నీకొక పని చెప్పబోతున్నాను. అది చాలా అపాయకరమైన పని. కాని నువు ఆ పని చెయ్యకపోతే నీ కొడుకుల ప్రాణాలు దక్కవు." అన్నాడు.

"నా కొడుకుల ప్రాణాల కన్న నాకు తమ అజ్ఞ నెరవేర్చటమే ప్రధానం. నేను చెయ్యవలసిన పని ఏమిటో సెలవియ్యండి," అన్నాడు వీరదాసు.

"శ్యామలనగరం రాజు దగ్గిర ఒక ప్రసిద్ధమైన పంచకల్యాణి గుర్రం ఉన్నది. నువూ, నీ కొడుకులూ వెళ్ళి ఆ గుర్రాన్ని పట్టుకు రావాలి. ప్రయాణానికి గుర్రా లిస్తాను. పని ఎలా చేసుకొస్తావో అది నీ ప్రయోజకత్వం మీదనే ఆధారపడి ఉంటుంది. నువు అప్రయోజకుడివి కావు. నాపట్ల నీకు అపారమైన విశ్వాసం కూడా ఉన్నది. అందుచేత నిన్ను నేను శత్రువుగా చూడటం లేదు," అన్నాడు రాజు.

"చిత్తం! రేపు ఉదయమే శ్యామల దేశానికి బయలుదేరి పోతాం," అన్నాడు

టి. వెంకటరావు



వీరదాసు. రాజు తనకు చెప్పిన పని అసాధ్యమైనదని అతనికి తెలుసును. శ్యామల రాజు ఆ గుర్రాన్ని తన ప్రాణం కన్న ఎక్కువగా చూసుకుంటాడు. దాన్ని ఆయన ఏ వెలకూ అమ్మడు; దాన్ని దొంగిలించటం మానవమాత్రులకు సాధ్యం కాదు: అలాటి ప్రయత్నం చేసినవారిని ఆ రాజు నిర్దయగా చంపేస్తాడు. కాని తన కొడుకుల ప్రాణాలు దక్కాలంటే వీరదాసు ఏదో విధంగా ఆ పంచకల్యాణిని తీసుకు రాక తప్పదు.

మర్నాడు ఉదయానికి రాజుగారు వీరదాసుకు బంగారు నాణాలు నింపిన సంచీ, నాలుగు గుర్రాలూ పంపాడు. వీరదాసూ, అతని కొడుకులూ ఆ గుర్రాల మీద శ్యామల నగరానికి బయలుదేరారు.

శ్యామల నగరం సముద్రతీరాన ఉన్నది. అక్కడికి దూర ప్రయాణమేగాక కష్టమయిన ప్రయాణం కూడానూ. వీరదాసు తన కొడుకులతో శ్యామలనగరం శివార్లలో ఉన్న దేవుడి మాన్యం చేరేసరికే చీకటి పడిపోయింది. పెద్ద గుడిచుట్టూ అనేకవేల యకరాలు దేవుడి మాన్యం. గుడికి సమీపంలోనే ధర్మకర్తగారి దేవిడీ ఉన్నది. దాన్ని ఆనుకునే ధాన్యాగారమూ, ఇతర కట్టడాలూ ఉన్నాయి. వాటికి ఒక పక్కగా గడ్డిమేట్లూ, ఊక బస్తాలూ, చిట్టు బస్తాలూ కొండల్లాగా కనబడుతున్నాయి.

వీరదాసు తిన్నగా ధర్మకర్తగారి దేవిడీకి వెళ్ళి, తననూ, తన కొడుకులనూ ఆ పెద్దమనిషికి పరిచయం చేసుకుని, "మాకు మీ నగరం కొత్త. మేం ఒక రాచకార్యం మీద బయలుదేరి వచ్చాం. ఇప్పుడే చీకటి పడిపోయింది. అందుచేత ఈ రాత్రికి మా భోజన సదుపాయాలూ, పడకా మీరు ఏర్పాటు చేసినట్టయితే మీ రుణం ఉంచుకోం," అని చెప్పాడు.

ధర్మకర్త వీరదాసు చేతఉన్న బరువైన సంచీకేసి చూసి, అందులో ఉన్నది బంగారమని గ్రహించి, అతిథులు ఎంతటి మర్యాదకైనా తగుదురని తెలుసుకుని, "మీరు

అంతగా చెప్పాలా? చాలాదూరం నుంచి వచ్చారు. ఈ రాత్రికి మీకు కావలసిన విధంగా జరుపుతాను. మీలాటి అతిథులు బహు అరుదుగా వస్తారు,'' అన్నాడు.

వీరదాసూ, కొడుకులూ సుఖంగా స్నానాలు చేసి, షడ్రసోపేతంగా భోజనాలు చేసుకున్నారు. కొడుకులను వెళ్ళి పడుకోమని పంపేసి, వీరదాసు ధర్మకర్తతో రహస్యంగా తాము వచ్చిన పనీ, దానికి ముందు నడిచిన కథా దాచకుండా చెప్పేసి, సలహా అడిగాడు.

వాళ్ళు పంచకల్యాణిని తీసుకుపోవటానికి వచ్చారని తెలియగానే ధర్మకర్త నిర్ఘాంతపోయాడు. ఆయన వీరదాసుతో, ''అయ్యా, మీరు వృథాగా శ్రమపడ్డారు. మీరు తలపెట్టిన కార్యం జరిగేది కాదు. తెల్లవారుతూనే మీరు తిరిగి వెళ్ళవచ్చు. మా రాజుగారు ఆ గుర్రాన్ని మీకు అమ్మరు. దాన్ని దొంగిలించటం కూడా మానవమాత్రుల తరం కాదు. తెలియక ఎవరన్నా అలాటి ప్రయత్నం చేసినా వారి ప్రాణాలు దక్కవు. నిజం చెబుతున్నాను,'' అన్నాడు.

వీరదాసు దీర్ఘంగా నిట్టూర్చి, ''ప్రాణాపాయం గురించి ఆలోచించే స్థితిలో లేము, బాబుగారూ! పంచకళ్యాణిని తీసుకుపోకపోతే అక్కడ మా రాజుగారు చంపేస్తారు. కాకపోతే, మానవయత్నం లేకుండా చావటం మా కిష్టం లేదు. అందుచేత, ప్రాణాలు పోయినా సరే పంచకళ్యాణిని తస్కరించటానికే ప్రయత్నిస్తాం. మా రాజుగారి సేవలో





కూడా పంపవచ్చు. కాని మీరు ఆ అశ్వశాల నుంచి ప్రాణాలతో బయట పడరు. మీ చావుకు నేను కారకుణ్ణి అవుతానే అని విచారిస్తున్నాను!" అన్నాడు.

"బాబుగారూ, మమ్మల్ని ఆత్మహత్య చేసుకుంటున్న వాళ్ళకింద జమ కట్టండి. మమ్మల్ని పొట్టు బస్తాలలో పంపారంటే మీకు పాపం రాదు సరికదా పుణ్యం వస్తుంది. మా మాట తీసెయ్యకండి," అని వీరదాసు ప్రాధేయపడ్డాడు.

ధర్మకర్త వారు నలుగురినీ తానే స్వయంగా గోతాలలో పెట్టి, వాటిని చిట్టుతో నింపి మూతులు కట్టి, తన నౌకర్లను పిలిచి, వాటిని కూడా బళ్ళమీది కెత్తించాడు. ఆయన వీరదాసుతో బంగారం ఉన్న సంచీని తన వద్దనే రహస్యంగా ఉంచుతాననీ, వీరదాసు తిరిగి వచ్చేటప్పుడు తప్పక తీసుకు పోవాలనీ అన్నాడు.

దాణా బస్తాలు శ్యామలనగరంలోని అశ్వశాలలోకి చేరేసరికి అర్ధరాత్రి అయింది. అశ్వశాలవాళ్ళు బస్తా లన్నిటినీ ఒక పక్కగా వేసి, వెంటనే నిద్రపోయారు.

అంతా సద్దుమణగగానే వీరదాసూ, కొడుకులూ గోతాలూ చించుకుని బయటికి వచ్చి, ఏ మాత్రమూ అలికిడి చెయ్యకుండా పంచకల్యాణి కట్టి ఉన్న కొట్టం కోసం వెతికి పట్టుకున్నారు.

చచ్చా మన్న కీర్తి అయినా ఉంటుంది. రాజద్రోహు లనిపించుకుని చచ్చే దానికన్న ఇది మేలు కాదా? పోతే మాకు మీరు ఒక్క సహాయం చెయ్యవచ్చు. మమ్మల్ని ఎలాగయినా రాజుగారి అశ్వశాలలో ప్రవేశ పెట్టే మార్గం చూడండి. ఈ సంచీలోని బంగారమంతా మీ కిచ్చుకుంటాను. అశ్వశాలలో ప్రవేశించినాక మాపాట్లు మేం పడతాం!" అన్నాడు.

ధర్మకర్త చాలాసేపు ఆలోచించి, "ఈ రాత్రికే మిమ్మల్ని రాజుగారి అశ్వశాలలో ప్రవేశ పెట్టగలను. రాజుగారి గుర్రాల కోసం చిట్టూ, పొట్టూ బస్తాలలోకి ఎక్కిస్తున్నారు నా మనుషులు. ఆ బస్తాలలో పెట్టి మిమ్మల్ని

పంచకల్యాణి మేలు జాతి అశ్వం కావటంచేత దాన్ని వాళ్ళు తేలికగా గుర్తించ గలిగారు. అది కూడా కొత్తవాళ్ళను చూడ గానే ఉద్రేకం చెంది, కళ్ళు పెద్దవి చేసి, చిన్నగా వణకసాగింది.

ఇదేమీ గమనించకుండా వీరదాసు చప్పున దాన్ని సమీపించి దాని మెడకున్న కట్టుతాడు విప్పబోయాడు. అతని చెయ్యి తగలగానే గుర్రం గట్టిగా సకిలిస్తూ, కాళ్ళు జాడించి వీరదానునూ, ఆయనకు సహాయం వచ్చిన ఆయన కొడుకులనూ తన్నబోయింది. వాళ్ళు నలుగురూ దూరంగా పారిపోయి తమ తలలు పగలకుండా కాపాడుకున్నారు.

ఇంతలో రక్షకభటులు రానే వచ్చి, వీర దానునూ, అతని కొడుకులనూ పట్టి బంధించి, అప్పటికప్పుడే రాజుగారి దగ్గిరికి తీసుకుపోయారు.

"వీళ్ళు పంచకల్యాణి కోసం వచ్చారా? తెల్లవారినదాకా అశ్వశాలలోనే బంధించి ఉంచండి. రేపు ఉదయం విచారణ చేద్దాం," అన్నాడు రాజు.

తెల్లవారగానే రాజు బందీలను తన ఇంటికి పిలిపించి, వారి కట్లు విప్పించి, కూర్చోమని మర్యాద చేసి, "మీ రెవరు? ఏ కారణం చేత ఈ అపాయంలో చిక్కుకున్నారు? మీ కథ అంతా చెప్పండి," అన్నాడు.

వీరదాసు ఏమీ దాచకుండా జరిగిన దంతా చెప్పాడు.

అంతా విని శ్యామల రాజు, "వీరదాసూ, ఇందులో నీ స్వార్థం ఏమీ లేదని నేను నమ్ముతున్నాను. కాని మీరందరూ ఈ క్షణాన చాలా అపాయకరమైన స్థితిలో ఉన్నారు. ఇంతకన్న అపాయకరమైన స్థితి నీకు ఎప్పుడైనా సంభవించిందా? సంభవించి ఉన్నట్టయితే చెప్పు. దాన్ని నేను విశ్వసించ గలిగితే నీ కొడుకులలో ఒకణ్ణి ప్రాణాలతో వదిలేస్తాను," అన్నాడు.

వీరదాసు తన గత జీవితం జ్ఞాపకం తెచ్చుకుని, "సంభవించింది, మహారాజా," అన్నాడు.

"అదేమిటో చెప్పు!" అన్నాడు రాజు.

—(వచ్చే సంచికలో మొదటి కథ)



# ధనయోగం

ఒక శెట్టిగారు ఒక జ్యోతిష్కుడితో మాట్లాడుతుండగా అక్కడికి ఒక పేద కుర్రవాడు వచ్చాడు. జ్యోతిష్కుడు శెట్టిగారికి ఆ కుర్రవాణ్ణి చూపించి, "వీడి తండ్రి కూలి చేసుకుని బతుకుతాడు. అయితేనేం? వీడికి త్వరలోనే గొప్ప ధనయోగం ఉన్నది. వీడి తండ్రి సుఖపడిపోతాడు," అన్నాడు.

జ్యోతిష్కుడి మీద మంచి గురి ఉన్న శెట్టిగారు ఆ కుర్రవాడి తండ్రిని వెతుక్కుంటూ పోయి, "నీ కొడుకు భారం కొంతకాలం నాకు వదిలిపెట్టు. నీకు రెండువందల రూపాయలిస్తాను," అన్నాడు.

కూలివాడికి ఏదో అనుమానం వేసి, "ఏ ఉద్దేశంతో అడుగుతున్నారు?" అన్నాడు.

"దురుద్దేశ మేమీ లేదు. వాడంటే ముచ్చటపడ్డాను. వాడికి మా ఇంట్లో రాజోపచారంగా జరుగుతుంది. కావలిస్తే ఇంకో మూడువందలు తీసుకో," అన్నాడు శెట్టిగారు.

కూలివాడికి అయిదువందలు ముట్టాయి. వాడి కొడుకుకు శెట్టిగారి ఇంట రాజోపచారంగా జరుగుతున్నది. నెల గడిచినా వాడికి డబ్బేమీ రాలేదు.

శెట్టిగారు జ్యోతిష్కుడి వద్దకు వెళ్ళి జరిగినదంతా చెప్పి, "ఆ కుర్రవాడికి ఇంతదాకా ధనయోగం పట్టలేదే?" అన్నాడు.

"పట్టకపోవట మేమిటి? నువ్విచ్చిన డబ్బుతో వాడి తండ్రి పది గేదెలను కొని, నిక్షేపంగా వ్యాపారం చేసుకుంటున్నాడు," అన్నాడు జ్యోతిష్కుడు.

—వై. రవీంద్రనాథ్






పాండవులు జూదంలో ఓడి, వనవాసం చెయ్యటానికి ద్రౌపదితో సహా హస్తినాపురం నుంచి అరణ్యాలకు బయలుదేరారు. ఇంద్రసేనుడు మొదలైన వాళ్ళు పధ్నాలుగు మంది సేవకులు రథాలు వెంట బెట్టుకుని వారి వెనకగా వచ్చారు.

దారిలో వారికి వర్ధమానపురం అనే ఊరు తగిలింది. పాండవులు ఆ ఊరికుండా వెళుతూండగా, హస్తినాపురం నుంచి బయలుదేరి వచ్చిన కొందరు పౌరులు వారిని చేరుకుని, "ధర్మరాజా, మేం లేకుండా మీ రెక్కడికి పోతారు? మమ్మల్ని కూడా మీ వెంట తీసుకుపొండి," అన్నారు.

వాళ్ళతో ధర్మరాజు, "మీ సోదరుడిలాటి వాణ్ణి, నా మనవి కొంచెం వినండి. మాకు రాబోయే కష్టాలు తలుచుకుని మా తాత భీష్ముడూ, మాకు తండ్రిలాటి వాడైన ధృతరాష్ట్రుడూ, అంతకన్న కూడా మా తల్లి కుంతీ తీరని దుఃఖంలో ఉంటారు. మీరు వెళ్ళి వారిని ఓదార్చినట్టయితే నాకు శుభం కలుగుతుంది. వాళ్ళను నేను మీకు అప్పగిస్తున్నాను. మీరు చాలా దూరం వచ్చారు. ఇక తిరిగి వెళ్ళండి," అన్నాడు.

అంత వినయంగా అడిగిన ధర్మరాజు మాట తీసి వెయ్యలేక, ఆ పౌరులు పాండవులను మెచ్చుకుంటూ హస్తినాపురానికి తిరిగి వెళ్ళిపోయారు.

తరవాత పాండవులు రథాలెక్కి గంగా తీరం వెంబడి అరణ్యాల కేసి పోతూ, సూర్యాస్తమానమయే వేళకు ఒక పెద్ద

27. మైత్రేయుడి శాపం



పడితే నేను భరించలేను. మీరు మీ మీ ఇళ్ళకు పొండి," అన్నాడు ధర్మరాజు.

"నిన్నే నమ్ముకుని వస్తామంటే నువు వద్దనటం భావ్యం కాదు," అన్నారు బ్రాహ్మణులు.

"నేను అసహాయుణ్ణి. నా తమ్ములు అసహాయులు. మీ కోసం కందమూలాలు తెమ్మని నా తమ్ములను కష్టపెట్టలేను," అన్నాడు ధర్మరాజు.

"మా తిప్పలన్నీ మేమే పడతాం. మామూలంగా మీరేమీ శ్రమపడవద్దు. మాకు కావలిసింది మీ సాంగత్యం మాత్రమే," అన్నారు బ్రాహ్మణులు.

ధర్మరాజు తమ పురోహితుడైన ధౌమ్యుడితో, "మునీశ్వరా, ఈ బ్రాహ్మణులు నా వెంట అష్టకష్టాలూ పడటానికి సిద్ధంగా ఉన్నారు. వద్దంటే వినరు. వీళ్ళను అరణ్యంలో ఎలా పోషించాలి? ఏదన్నా ఉపాయం ఉన్నదా?" అన్నాడు.

"ధర్మరాజా, అన్నం ఆదిత్యమయం. నువు సూర్యుణ్ణి ఆరాధించి, సూర్యుడి మహిమ చేత ఈ బ్రాహ్మణులను పోషించు," అని ధౌమ్యుడు ధర్మరాజుకు సూర్యస్తోత్రం ఉపదేశించాడు.

ధర్మరాజు కొన్ని రోజులు నిష్ఠగా సూర్యారాధన చెయ్యగా సూర్యుడు ప్రత్యక్షమై, ఒక రాగి పాత్రను ఇచ్చి, "ధర్మరాజా,

చెట్టున్న చోటికి చేరుకుని, ఆ రాత్రికి ఆ చెట్టు కింద నిలిచారు. చుట్టు పక్కల గ్రామాల నుంచి అనేకమంది బ్రాహ్మణులు వారి వద్దకు వచ్చి, అనేక పుణ్యకథలు చెప్పి ఆ రాత్రి వెళ్ళబుచ్చారు.

తెల్లవారగానే పాండవులు గంగాస్నానం చేసి, అరణ్య మార్గాన బయలుదేరబోతూ ఉన్న సమయంలో, భిక్షాటన వృత్తిగా గల బ్రాహ్మణులు కొందరు, ధర్మరాజు వెంట అరణ్య వాసానికి వస్తామన్నారు.

"మాకు ఉన్నదంతా పోయి, నియమానికి కట్టుబడి అరణ్యవాసం చెయ్యబోతున్నాం. అరణ్యాలలో మీరెలా జీవిస్తారు? నా కారణంగా మీరు బాధలు



ఇది అక్షయపాత్ర. ద్రౌపది కాయలనూ, దుంపలనూ వండి ఇందులో ఉంచితే, వనవాసం పన్నెండేళ్లూ, నీకూ, నీ అతిథులకూ కావలిసిన ఆహారమంతా ఇందులో లభిస్తుంది," అని చెప్పి మాయమయాడు.

ధర్మరాజు ఆ అక్షయపాత్రను ద్రౌపదికి ఇచ్చాడు. అది మొదలు ద్రౌపది కాయగూరలు వండి అందులో ఉంచితే, అందులో నుంచి అన్నిరకాల ఆహారాలూ అంతు లేకుండా లభిస్తూ ఉండేవి.

తరవాత పాండవులు గంగా తీరాన్ని వదిలిపెట్టి వడమటగా అరణ్యాల వెంబడి బయలుదేరి యమునా, దృషద్వతీ నదులు గడిచి, సరస్వతీనదీ తీరాన గల కామ్యకవనం ప్రవేశించారు. అది చాలా అందమైన ప్రదేశం. అక్కడ అనేకమంది మునులు ఉంటున్నారు.

పాండవులు ఇలా కామ్యకవనంలో ఉండగా, హస్తినాపురంలో ధృతరాష్ట్రుడు విదురుణ్ణి పిలిచి, "విదురా, పాండవులు వనవాసం పోయిన తరవాత ప్రజలు మనకు దూర దూరంగా ఉంటున్నారు. వాళ్ళు మనకేదైనా అపకారం చేస్తారో ఏమో! వాళ్ళను చేరదీసే ఉపాయం ఏదన్నా ఉంటే చెప్పు," అన్నాడు.

"రాజా, ధర్మార్థ కామాలకు ధర్మం మూలం. నువు ధర్మం పాటించి, పాండవులనూ, నీ కొడుకులనూ కూడా కాపాడుకో. పాండవుల రాజ్యాన్ని శకుని ద్వారా దుర్యోధనుడు మోసం చేసి కాజేశాడు. పాండవులు నీ కొడుకులందరినీ నిర్మూలించ గల వాళ్ళు. ధర్మరాజుకు రాజ్యం ఇచ్చి, దుర్యోధన శకుని కర్ణాదులు ధర్మరాజును కొలవనీ. నిండు సభలో దుశ్శాసనుడి చేత ద్రౌపదికీ, భీముడికీ క్షమాపణ చెప్పించు. ధర్మరాజు క్షమాపణ అమోదిస్తాడు. నన్ను సలహా అడిగావు గనక చెప్పాను," అని విదురుడు అన్నాడు.

ధృతరాష్ట్రుడు, కోపం వచ్చి, "నా కన్న కొడుకును పరాయివాళ్ళ కోసం ఎట్లా వదులుకుంటాను? నువు ఈ మాట చెప్పదగిన

దేనా? నేను నిన్ను ఎంత మర్యాదగా చూస్తున్నా నీ కుత్సితబుద్ధి మారదు. నా కొడుకుల బాగు చూడలేవు. నీవి అన్నీ దురాలోచనలు. అవి వింటే నేను నాశన మవుతాను. ఎప్పుడూ పాండవులను ఆకాశాని కెత్తుతావు. వాళ్ళ దగ్గిరికే వెళ్ళి ఉండు. లేదా, నీ యిష్టం వచ్చిన మరో చోటికి వెళ్ళు." అన్నాడు.



వెంటనే విదురుడు రథం తెప్పించి, పాండవులున్న కామ్యకవనానికి వెళ్ళాడు.

విదురుడు వెళ్ళే సమయానికి ధర్మరాజు చుట్టూ బ్రాహ్మణులను పెట్టుకుని, కొలువు తీరి ఉన్నాడు. అతను విదురుణ్ణి దూరానే చూసి, భీముడితో, "జూదంలో మనం మన ఆయుధాలు ఓడ లేదు గాదూ? వాటిని గెలుచుకునేటందుకు మళ్ళీ జూదం ఆడ రమ్మని పిలవటానికి దుర్యోధనుడూ, శకునీ విదురుణ్ణి పంపించారల్లే ఉన్నది. లేకపోతే విదురుడు పనిపెట్టుకుని ఇక్కడికి ఎందుకు వస్తున్నట్టు? విదురుడు పిలిస్తే నేను రాకుండా ఉండనని వాళ్ళ ఉద్దేశమేమో! ఏమైనా ఇక నేను జూదం ఆడలేను. అర్జునుడి గాండీవమూ, నీ గదా వాళ్ళు జూదంలో గెలుచుకున్నారంటే ఇక మనకు రాజ్యం ఆశ లేదు!" అన్నాడు.

ఇంతలో విదురుడు దగ్గిరికి వచ్చాడు. రాజు మొదలైన వాళ్ళు లేచి ఆయనకు ఎదురు వెళ్ళి, నమస్కారం చేసి తీసుకు వచ్చి కూర్చోబెట్టి, ఆయన వచ్చిన పని అడిగారు. ధృతరాష్ట్రుడు తనను హితం అడగటమూ, తాను చెప్పటమూ, అది రుచించక ధృతరాష్ట్రుడు తనను వెళ్ళగొట్టటమూ విదురుడు ధర్మరాజుకు తెలిపాడు. అలా అయితే, తన వద్దనే ఉండి, అడుగడుగునా తనకు ఆలోచన చెప్పమన్నాడు ధర్మరాజు విదురుడితో.

విదురుడు కామ్యకవనంలో పాండవులను చేరుకున్నట్టు ధృతరాష్ట్రుడికి తెలిసింది. విదురుడి సలహాతో పాండవులు ఎంత లాభం పొందుతారో అనిపించి ధృతరాష్ట్రుడికి మూర్ఛ వచ్చింది. కొంతసేపటికి ఆయన స్పృహ



తెచ్చుకుని, సంజయుడితో, ''సంజయా, విదురుడు నా తమ్ముడు. నా స్నేహితుడు. ఎంతో బుద్ధిమంతుడు. కొంచెం కఠినంగా మాట్లాడానని అలిగి, కామ్యకవనానికి వెళ్ళి, పాండవుల దగ్గిర చేరాడు. అతను లేకపోతే నా బుద్ధి పని చెయ్యకుండా ఉన్నది. నువ్వు వెంటనే వెళ్ళి, విదురుణ్ణి తీసుకురా,'' అన్నాడు పశ్చాత్తాపంతో ఏడుస్తూ.

సంజయుడు కామ్యకవనానికి వెళ్ళి, విదురుణ్ణి తీసుకు పోవటానికి వచ్చినట్టు ధర్మరాజుతో చెప్పి, విదురుడితో, ''మహాను భావా, మీరు వచ్చినది మొదలు ధృత రాష్ట్రుడి ప్రాణాలు గిలగిలా కొట్టుకుంటు న్నాయి. మిమ్మల్ని తీసుకు రమ్మని నన్ను పంపాడు. మీరు వచ్చి ఆయన ప్రాణాలు నిలబెట్టండి,'' అన్నాడు.

విదురుడు ధర్మరాజు అనుమతి పొంది, సంజయుడి వెంట హస్తినాపురానికి వచ్చాడు. ధృతరాష్ట్రుడు విదురుణ్ణి కౌగ లించుకుని, ''నువు చాలా మంచివాడివి. నా మాట పాటించి తిరిగి వచ్చావు. ఇన్ని రోజులూ ఏమీ తోచక కొట్టుకున్నాను. నా తప్పులు క్షమించు,'' అన్నాడు.

దానికి విదురుడు, ''నీ ఆజ్ఞ అయిందని వచ్చాను. నేను నీకు హితమైన మాటలే చెప్పాను. నాకు వాళ్ళూ ఒకటే, వీళ్ళూ ఒకటే. కాకపోతే, వాళ్ళు దీనస్థితిలో ఉన్నారు గనక వారిపై జాలి హెచ్చు. అది న్యాయమే కూడానూ,'' అన్నాడు.

విదురుడు మళ్ళీ తన తండ్రిని చేరుకునే సరికి దుర్యోధనుడు కర్ణ శకుని దుశ్శాసను లను పిలిపించి, ''మళ్ళీ విదురుడు వచ్చాడు. ఆ పాండవ పక్షపాతి తండ్రికి ఏమి సలహా చెబుతాడో తెలీదు. పాండవులు తిరిగి వచ్చారో, నేను ఆత్మహత్య చేసుకుంటాను,'' అన్నాడు.

శకుని దుర్యోధనుడితో, ''మూఢుడిలాగా మాట్లాడకు. నీ తండ్రి రమ్మన్నా పాండవులు రారు. ఒకవేళ వచ్చినా, మళ్ళీ ధర్మరాజు చేత జూదం ఆడించి, దేబెలను చేసి పంపేద్దాం,'' అన్నాడు.

దుర్యోధనుడి కీ మాట రుచించలేదని గ్రహించి కర్ణుడు శకుని దుశ్శాసనులతో "మనం యుద్ధసన్నద్ధులమై ఇప్పుడే బయలు దేరి పోయి, అరణ్యంలో అసహాయులుగా ఉన్న పాండవులను చంపి వద్దాం. వాళ్ళు బతికి ఉన్నంతకాలమూ మనకు శత్రువులే. ఇప్పుడు కాకపోతే తరవాత వారిని గెలవటం కష్టం," అన్నాడు.

ఈ మాటలకు అందరూ సంతోషించి, సైన్యంతో సహా పాండవుల మీదికి యుద్ధానికి వెళ్ళ నిశ్చయించారు.

సరిగా ఈ సమయంలో వ్యాసుడు ధృతరాష్ట్రుడి వద్దకు వచ్చి, "దుర్యోధనాదులు మాయ జూదంలో పాండవులను రాజ్యభ్రష్టులను చేసి, అరణ్యాలకు పంపటం నాకేమీ బాగా లేదు. ఇప్పుడు అరణ్యంలో ఉన్న ఆ పాండవుల మీదికి నీ కొడుకు యుద్ధానికి పోబోతున్నాడు. వెళ్ళాడో, భంగ పడి వస్తాడు. నీ కొడుకు చేత ఈ ప్రయత్నం మాన్పించు. నువ్వూ, భీష్ముడూ, ద్రోణుడూ, విదురుడూ ఈ అధర్మాన్ని జరగనిస్తున్నా రెందుకు?" అన్నాడు.

దానికి ధృతరాష్ట్రుడు, "మహానుభావా, ఈ జరిగినదంతా మా కెవరికీ ఇష్టం లేదు. కాని పుత్ర ప్రేమ చేత దుర్యోధనుడికి అడ్డు పడ లేకుండా ఉన్నాను. మీరే వాడికి బుద్ధి చెప్పండి," అన్నాడు.



"నేను వెళ్ళాలి. ఇక్కడికి మైత్రేయుడనే ముని వస్తున్నాడు. అతనే నీ కొడుక్కు చెప్పవలసినది చెబుతాడు," అంటూ వ్యాసుడు వెళ్ళిపోయాడు.

వ్యాసుడు చెప్పినట్టే మైత్రేయమహాముని కొద్ది రోజులకు హస్తినాపురం చేరి, ధృతరాష్ట్రుణ్ణి చూశాడు. ధృతరాష్ట్రు డాయనకు సమస్తోపచారాలూ చేసి, "మహాత్మా, మీరు ఎక్కడి నుంచి వస్తున్నారు?" అని అడిగాడు.

"నేను తీర్థయాత్రలు చేస్తూ కామ్యకవనానికి వెళ్ళి, అక్కడ పాండవుల వద్ద కొన్ని రోజులుండి, నిన్ను చూసి పోదామని ఇలా వచ్చాను. పాండవులు జడలు దాల్చి,

నారబట్టలు కట్టి, ఆకులూ, అలములూ తింటూ ఆ అరణ్యంలో నా నా కష్టాలూ పడుతున్నారు," అన్నాడు మైత్రేయుడు.

వెంటనే ధృతరాష్ట్రుడు, "మునీశ్వరా, పాండవులు క్షేమంగా ఉన్నారు గద? వాళ్ళు నియమాన్ని ఉల్లంఘించే ఆలోచనలో లేరు గద?" అని అడిగాడు.

"వాళ్ళు లోకాలు తల కిందైనా చేసు కున్న నియమాన్ని తప్పరు. అలాటి వాళ్లకు నీ కొడుకు ద్రోహం చేశాడు! జూదం గురించి అంతా విన్నాను," అని మైత్రే యుడు దుర్యోధనుడితో, "అయ్యా, నీకే మన్నా కాస్త బుద్ధి ఉంటే పాండవుల స్నేహం సంపాదించుకో. వాళ్ళు మహా శూరులు. కామ్యకవనంలో భీముడు కిమ్మీరు డనే భయంకర రాక్షసుణ్ణి చంపాడు. అతను బకుణ్ణీ, హిడింబుణ్ణీ, జరాసంధుణ్ణీ చంపిన సంగతి మీకూ తెలుసు. ద్రుపదుడి లాటి బలవంతులు వాళ్ళకున్నారు. కృష్ణుడు వాళ్ళపక్షం. అలాటి వాళ్ళతో నీకు విరోధం దేనికి?" అన్నాడు.

దుర్యోధనుడు ఈ మాటలు విని వేళా కోళంగా తన చేతులతో తొడలు చరుచుకుని, చేతులు పైకెత్తి, కాలి బొటన వేలితో నేల రాచాడు. అది చూసి మైత్రేయుడు కోపించి, "ఆ తొడలు భీముడి గదతో విరుగుగాక!" అని శపించాడు.

ధృతరాష్ట్రుడు ఆందోళనగా, "స్వామీ, అలా జరగకుండా అనుగ్రహించండి," అన్నాడు.

"దానికి ఒకటే మార్గం: నీ కొడుకు పాండవులపై పగమాని, సఖ్యంగా ఉండ టమే," అన్నాడు మైత్రేయుడు.

"మహాత్మా, కిమ్మీరు డనేవాణ్ణి భీముడు చంపాడన్నారే, ఆ సంగతి కాస్త చెప్పండి," అని ధృతరాష్ట్రుడు అడిగాడు.

"అది నేను చెప్పను. విదురుణ్ణి అడిగితే అతను చెబుతాడు. నేను వెళ్ళి వస్తాను," అంటూ మైత్రేయమహాముని వెళ్ళిపోయాడు.

"భీముడు కిమ్మీరుణ్ణి చంపాడుగా!" అని విచారిస్తూ దుర్యోధనుడు సభామందిరం నుంచి అవతలికి వెళ్ళిపోయాడు.





# శివపురాణం

## 4

పరదేవతను గురించి తపస్సు చేసి, ఆమె తమ కుమార్తెగా పుట్టేటట్టు వరం పొందమని మేనకా హిమవంతులకు చెప్పి, బ్రహ్మ విష్ణు మహేంద్రాదులు వింధ్యపర్వతానికి వెళ్ళి, అక్కడ తపస్సు చేస్తున్న మహాదేవిని స్తోత్రం చేశారు.

కాంతులు అన్నిదిశలా విరజిమ్మే కిరీటం ధరించి, వెయ్యి చేతులతో త్రిశూలం మొదలైన ఆయుధాలు ధరించి పరదేవత వారి ముందు ప్రత్యక్షమయింది. అప్పుడు బ్రహ్మాదులు ఆమెతో, "తల్లీ, నువు దక్షుడి కుమార్తెగా జన్మించి, సతి అనే పేరుతో శివుణ్ణి వివాహమాడి, దక్షుడి మీది కోపంతో సతీ దేహాన్ని విడిచేశావు. సతీ వియోగంతో విరక్తుడై శివుడు తపస్సులో మునిగిపోయాడు. అందుచేత తారకాసురుడు మొదలైన వాళ్ళు యథేచ్ఛగా లోకాలను పీడిస్తున్నారు. కనుక, ఇప్పుడు నువు మేనకా హిమవంతుల కడుపున పార్వతిగా పుట్టి, శివుణ్ణి పెళ్ళాడి, లోకాలను కాపాడాలి," అన్నారు.

మహాదేవి బ్రహ్మ విష్ణు మహేంద్రుల కోరిక తీర్చుతానని మాట ఇచ్చి అంతర్హితురాలయింది.

ఈలోపల మేనకా హిమవంతులు బ్రహ్మ మొదలైన వారి హితాన్ని అనుసరించి, వారు సూచించిన విధంగా తపోనియమం దాల్చి, చైత్ర శుద్ధ పాడ్యమినాడు ప్రారంభించి ఇరవైఏడు వారాలపాటు అమిత భక్తితో పరదేవతను పూజించారు. పరదేవత సంతోషించి, వారి ఎదట ప్రత్యక్షమై వరం కోరమన్నది.

అప్పుడు మేనకా హిమవంతులు, "తల్లీ, నీ మూలంగా మేము తరించాం. మాకు



బలశౌర్య గుణాఢ్యులైన నూరుమంది కొడుకులను ప్రసాదించి, మా గర్భవాసాన కుమార్తెవుగా పుట్టి, లోకరక్షణార్థం శివుణ్ణి పెళ్ళాడి, మాకు శాశ్వతమైన కీర్తిని కలిగించు!" అని కోరారు.

పరదేవత వారి కోరికలు తీరుస్తానని వరమిచ్చి అంతర్ధానమయింది.

మేనకా హిమవంతులు తమ ఇంటికి తిరిగి పోయి సుఖంగా ఉన్నారు. కాల క్రమాన మేనక గర్భవతి అయి, అయిదు గ్రహాలు ఉచ్చలో ఉన్న సమయంలో మైనాకుడనే కొడుకును కన్నది. అతని తరవాత వరుసగా మరి తొంభైతొమ్మిదిమంది కొడుకులు కలిగారు. వారి తరవాత మేనక తిరిగి గర్భం దాల్చి, తొమ్మిదిమాసాల పదిహేను రోజులకు, అరుద్రా నక్షత్రం గల చైత్ర శుద్ధ నవమినాడు, పార్వతిని కన్నది. ఆ సమయంలో దిక్కులు వెలిగాయి. దేవతలు పుష్పవృష్టి కురిపించారు. బ్రహ్మ, విష్ణువు, దేవేంద్రుడు మొదలైన వాళ్ళు పరదేవతను స్తోత్రం చేశారు.

పార్వతి పుట్టటం నీలకాంతి గల శరీరచ్ఛాయతోనూ, నాలుగు చేతులతోనూ, లలాట నేత్రంతోనూ కాళిక ఆకారంతో పుట్టింది. అది చూసి మేనక, ఆమెను మామూలు మానవ శిశువు రూపం ధరించమని ప్రార్థించింది. అప్పుడామె మామూలు శిశువుగా మారి ఏడవ నారంభించింది.

తనకు కుమార్తె కలిగిందన్న వార్తవిని హిమవంతుడు పరమానంద భరితుడై, పురోహితులనూ, బ్రాహ్మణులనూ వెంటబెట్టుకుని పురిటింటికి వచ్చి, పచ్చకర్పూరపు దీపాలు వెలిగింప జేసి, కస్తూరీ జలం చల్లించి, నృత్యగానాలు ఏర్పాటు చేసి, బ్రాహ్మణుల చేత ఆశీర్వచనం చేయించి, వారికి ధనమూ, ధాన్యమూ, బంగారు ఆభరణాలూ, పట్టుపీతాంబరాలూ ఇచ్చి, కొడుకులతోనూ, కూతురితోనూ సుఖంగా జీవించసాగాడు.

పార్వతి క్రమంగా పెరిగి పెద్దదవుతున్నది. ఆమె చెలికత్తెలతో ఆడేది. మదించిన

సింహాలను ఎక్కి కొండలన్నీ తిరిగేది. గుహల లోనూ, ఇసుకతిన్నెల మీదా దాగుడుమూత లాడేది. తాను తల్లి అయినట్టూ, తన చెలికత్తెలు పిల్లలయినట్టూ వాళ్ళకు పళ్ళు పంచిపెట్టేది. బంతులతో ఆడేటప్పుడు ఒక బంతిని తన స్నేహితురాళ్ళకు చూపి, "ఇది బ్రహ్మాండం! దీన్ని నేను ఇలా ఆడిస్తాను!" అనేది. బొమ్మలతో ఆడేటప్పుడు వాటికి బ్రహ్మ, విష్ణూ, మహేశ్వరుడూ అని పేరు పెట్టి, "నేను వీళ్ళను ఆడిస్తున్నాను" అనేది. బొమ్మరిల్లు కట్టుతూ, తాను బ్రహ్మననీ, దాన్ని కాపాడుతూ తాను విష్ణువుననీ, దాన్ని కూలదోస్తూ తాను మహేశ్వరుణ్ణనీ అనేది.

ఈ విధంగా పార్వతి బాల్యం వెళ్ళబుచ్చి, విద్యాభ్యాసం ప్రారంభించి, సకల విద్యలూ నేర్చుకున్నది. ఆమె అస్తమానమూ పరమేశ్వరధ్యానం చేస్తూ, సామగానంతో స్తుతి చేస్తూ, నిత్య సంతోషిగా కాలం గడిపేది. అలాంటి సమయంలో చెలికత్తెలు "పార్వతీ" అని పిలిస్తే పలికేది కాదు, "శివాణీ" అని పిలిస్తే వెంటనే పలికేది. ఎప్పుడూ సింహాన్ని ఎక్కి తిరిగేది. అలా తిరిగేటప్పుడు ఒక్కొసారి ఆమె చేతిలో విల్లూ, బాణాలూ, శూలమూ మొదలైన ఆయుధాలు కనిపించేవి. ఆమె మరొక వాహనాన్ని ఎక్కటం గాని, ఇతర ఆయుధాలు ధరించటంగాని



ఎన్నడూ చెయ్యలేదు. ఒక్కొక్కప్పుడు వీణ వాయిస్తూ ఆనందించేది. విద్యాధరలను మించి పాడేది, నృత్యం చేసేది. శివుడి రూపం చిత్రించి తన చెలికత్తెలకు చూపేది.

ఇలా ఉండగా ఒకనాడు నారదమహాముని హిమవంతుణ్ణి చూడ వచ్చాడు. హిమవంతుడు నారదుడికి ఎదురు వెళ్ళి, పూజించి, తీసుకు వచ్చి కూర్చోబెట్టి, పార్వతిని పిలిపించి, ఆమెచేత నారదుడికి నమస్కారం పెట్టించి, తన ఒళ్ళో కూర్చోబెట్టుని, "ఈ పిల్లకు ఎలాటి భర్త వస్తాడో చూడండి." అన్నాడు.

నారదుడు పార్వతి చేతిలో గజ, మత్స్య, అంకుశ, రథరేఖలు చూసి, "హిమవంతా,

నీ కూతురి చేతిలో పరదేవత లక్షణాలు న్నాయి. ఈమె మూలంగా మీకు గొప్ప కీర్తి వస్తుంది. లక్ష్మీ సరస్వతులతో సమమైన గౌరవ పూజలు ఈమెకూ జరుగుతాయి. ఈమెకు తగిన భర్త శివుడే. అందు చేత, ఎలాటి ఇతర ఆలోచనలూ చెయ్యక, ఈ పిల్లను శివుడి కిచ్చి వివాహం చేసె య్యండి," అన్నాడు.

నారదుడు వెళ్ళిపోయాక హిమవంతుడు మేనకతో, "మనం శివుడికి భార్యకాగల కుమార్తెను ప్రసాదించమని పరదేవతను ప్రార్థించాం. దానికీ, నారదుడు యిప్పుడు మనకు చెప్పి పోయిన దానికీ సరిపో యింది," అన్నాడు.

మేనక సంతోషించి, "మన పార్వతికి పెళ్ళి యీడువచ్చింది. అందు చేత యిక ఆలశ్యం లేకుండా పెళ్ళి ప్రయత్నం చెయ్యండి," అన్నది.

"శివుడు సతిపోయాక, ఆమె శరీరాన్ని మూపున వేసుకుని ప్రపంచమంతా తిరు గుతూ గంగాసాగర సంగమం వద్ద కాళీ ఘట్టంలో నృత్యం చేస్తూ ఉండగా, విష్ణువు తన మాయచేత సతిని కాళీరూపంలో అక్కడ స్థాపన చేయించి, శివుడికి జ్ఞానం ఉపదే శించాడట. అప్పుడు శివుడు వైరాగ్యంపొంది, వీరాసనం వేసుకుని తపస్సులో లీనమై పోయాడు. అయితే శివుడు భక్తవత్సలుడు. తపస్సుతో ఆయనను సాధించవచ్చు. అందుచేత మనం పార్వతి చేత శివుణ్ణి గురించి తపస్సు చేయించుదాం!" అని హిమవంతుడు మేనకతో అన్నాడు.

ఆ ప్రకారమే ఆ తల్లిదండ్రులు పార్వతిని శివుణ్ణి గురించి పట్టుదలతో తపస్సు చేయ నియమించారు.

తరవాత మేనకా హిమవంతులు పార్వతీ సమేతులై శివుడు తపస్సు చేసుకుంటున్న కైలాసానికి వెళ్ళారు. ఆయన చుట్టూ గణాధిపతులు ఆయుధాలు ధరించి నిలిచి ఉన్నారు. కొందరు శివుడి సపర్యలు చూస్తు న్నారు. హిమవంతుడు శివుడి సమీపానికి వెళ్ళటానికి రుద్రగణాల వాళ్ళు అనుమ తించారు.



# 114. ఇగ్వాజు జలపాతం

ఇగ్వాజు నది బ్రెజిల్ (దక్షిణ అమెరికా) లోని దక్షిణ ప్రాంతపు కొండలలో పుట్టి ఇంచుమించు పడమరగా 800 మైళ్ళు పారి పరనా అనే నదిలో కలుస్తుంది. ఇగ్వాజు నది పొడుగునా అనేక ఝరులూ, జలపాతాలూ ఉన్నాయి. జలపాతాలలో జగత్ప్రసిద్ధమైనది ఇక్కడ చూపిన ఇగ్వాజు జలపాతం. పరగ్వాయ్, బ్రెజిల్, అర్జంటీనాల సరిహద్దులు కలిసే చోటికి ఇది 12 మైళ్ళ దూరంలో ఉన్నది. మూడుమైళ్ళపాటు ఇది కొండరాళ్ళ మీదుగా ప్రవహించి, జంట జలపాతంగా మారుతుంది. ఒక్కొక్కపాతం 180 అడుగుల ఎత్తుంటుంది. నదిలో ఒక పాయ సూటిగా 760 అడుగులు పాతం అవుతుంది. వానాకాలంలో ఈ జంట జలపాతం నిడివి 13,000 అడుగులకు విస్తరించుతుంది. ఆ సమయంలో నిమిషానికి 280 లక్షల ఘనపుటడుగుల నీరు పతనమవుతుందట. ఈ విషయంలో విక్టోరియా, నయాగరా జలపాతాలు దీనికి చాలవు.



Chandamama, May '71 Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

పక్షులము మేము

పంపినవారు:
ఎస్. కె. మూర్తి, తిరుపతి

Photo by Prabhakar Mahadik



బహుమతి
పొందిన వ్యాఖ్య

పయనిస్తూ వుంటాము

పంపినవారు :
ఎస్. కె. మూర్తి, తిరుపతి

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1971 జూలై నెల సంచికలో ప్రకటించబడును





★ పై ఫోటోలకు సరి ఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి.)

★ మే నెల 20 వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంత మాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా వున్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రు. 20/- లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డు పైన వ్రాసి, ఈ అడ్రసుకు పంపాలి :—చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు—26.

---

## మే నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : పక్షులము మేము

రెండవ ఫోటో : పయనిస్తూ వుంటాము

పంపినవారు : ఎస్. కేశవమూర్తి,

రిజర్వాయర్ రోడ్, తిరుపతి.

బహుమతి మొత్తం రు. 20/—ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at The Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for Sarada Binding Works, 2 & 3, Arcot Road, Madras-26. Controlling Editor: 'CHAKRAPANI'

మీకు ప్రియమైన

# చందమామ

వెల జూలై నెల నుంచి కొంచెంగా పెరుగుతున్నది. విడి సంచిక 90 పైసలు మాత్రమే, సంవత్సర చందా రూ. 10-80 పై. ఈ కొద్దిపాటి వెల హెచ్చింపు జరిగినప్పటికీ, మీరు ఎప్పటి అభిమానంతో పత్రికను ఆదరిస్తారని నమ్ముతున్నాము.



చందమామ పబ్లికేషన్స్

వడపళని :: మద్రాసు - 26

# చిన్న చిన్న ఉప్పు బిస్కట్లు





## చక్రా-70 బ్రిటానియా బిస్కట్లు మాత్రమే ఇవ్వగల ప్రత్యేకమైన రుచి

సైజులో చిన్నవి. తినడానికి అనుకూలమైనవి.
మీరు వెచ్చించే డబ్బుకి ధారాళంగా కొనుక్కోవచ్చు.
గరగరలాడుతూ ఉండే చక్రా-70 రుచికరమైనవి.
ఎన్నితిన్నా తనివి తీరదు.




అంటే నాణ్యత

BBC/6167


Chiclets
12 PIECES



# తియ్యని ఆట

గుడు గుడు గుంచం గుండే రాగం
పాముల పట్టం పడగా రాగం
**న్యూట్రిన్** టాఫీ నీకై తెస్తా
**న్యూట్రిన్** కేండీ నేను తినేస్తా
కేండీ, టాఫీ, క్రంచ్, క్యూబులు
గలవు **న్యూట్రిన్**లో చాలా రకాలు
గుడు గుడు గుంచం గుండే రాగం
**న్యూట్రిన్** మిఠాయి పిల్లల భోగం

NCM-16 TEL






న్యూట్రిన్ కన్ఫెక్షనరీ కంపెనీ ప్రైవేట్ లిమిటెడ్, చిత్తూరు (ఆం.ప్ర)

ఎలప్రాయంలోనే
పాపకు
నేర్పండి

# నియమానుసారం ఫోర్‌హాన్స్ టూత్‌పేస్టుతో పళ్లు తోముకుంటే ఇగుళ్ల బాధలను, దంతక్షయాన్నీ అరికట్టుతుంది.



ఫోర్‌హాన్స్ పళ్లనూ, ఇగుళ్లనూ కూడా రక్షిస్తుంది. ఇది దంతవైద్యునిచే సృష్టింపబడింది. ఇగుళ్ల రక్షణకై ప్రత్యేకమైన పదార్థాలు దీనిలో ఉన్నాయి. నియమానుసారం, రాత్రి, ప్రొద్దుట, ఫోర్‌హాన్స్‌తో పళ్లు తోముకుంటే, ఇగుళ్ల బాధలు, దంతక్షయము మీ దగ్గరకు రావు. మీ బిడ్డకు ఈ ముఖ్య విషయం నేర్పటానికి ఇదే మంచి తరుణం. క్రొత్త విషయాలు నేర్చుకోవాలనే ఉత్సుకత ఉన్నప్పుడే నేర్పటం ఉత్తమం. కావున, నేడే ప్రారంభించండి.

ఫోర్‌హాన్స్ దంతసంరక్షణ ఎంత చిన్న వయసులో నేర్పితే అంత ఉత్తమం.




ఫోర్‌హాన్స్
దంతవైద్యునిచే
సృష్టింపబడిన
టూత్‌పేస్టు

**ఉచితము** "దంతములు ఇగుళ్లను గురించి తీసుకోవలసిన శ్రద్ధ" అను వివరణాత్మకమైన చిన్న రంగుల పుస్తకము. ఇది పది భాషలలో*, మానర్స్ డెంటల్ అడ్వైజరీ బ్యూరో, పోస్ట్ బ్యాగ్ 10031, బొంబాయి-1 బిఆర్, వద్ద దొరకును.

పేరు ______ వయస్సు ______

చిరునామా ______



*పోస్టు ఖర్చులకై, 20 పైసల తపాలా బిళ్లలు పంపండి. ఇంగ్లీషు, హిందీ, మరాఠీ, గుజరాతీ, ఉరుదు, బెంగాలీ, తమిళం, తెలుగు, మలయాళం, కన్నడ భాషలలో ఏది కావాలో సూచిస్తూ, దాని క్రింద గీతగీయండి.

92F-183D TEL

'C. 1'

